# గోవాడ నుండి

# దగ్గుమిల్లి చరిత్రలోనికి

సంకలనకర్త

**కాట్రగడ్డ బసవపున్నయ్య**

**తొలిముద్రణ :**
డిసెంబర్ 2004
500 ప్రతులు

వెల : రూ. 40.00

**డి.టి.పి. :**
**శ్రీ బాలాజీ డి.టి.పి. సెంటర్, తెనాలి.**

**ప్రతులకు :**

డోర్ నెం. 1-9-34, అబ్బరాజువారి వీధి,
నాజరుపేట, తెనాలి - 1,
ఫోన్ : 221754.

# అభిప్రాయములు



డా॥ పురాణం రాధాకృష్ణప్రసాద్,
M.A.,Ph.D.,G.D.,(Arts)
పురాతత్త్వవేత్త, చరిత్ర పరిశోధకులు
అసిస్టెంట్ డైరెక్టర్ - ( రిటైర్డ్ )
కేంద్ర ప్రభుత్వ పురావస్తుశాఖ,తెనాలి.

గోవాడ నుంచి దగ్గుమిల్లి చరిత్రలోనికి ప్రవేశించి అనేక విషయాలను

తిరునాళ్ళు గుర్తుకువస్తాయి. ఆ సందర్భంగా గోవాడ బాలకోటేశ్వర స్వామివారి ఉత్సవాలు మహా వైభవంగా జరిగేవి. ఎద్దుల పందెములు జరిగేవి. భక్తులు రంగు రంగుల ప్రభలు కట్టి ఆలయం చుట్టూ ప్రదక్షిణలు చేయించి, తమ మొక్కులను తీర్చుకునేవారు. అక్కడకు వచ్చి చేరిన భక్త సందోహానికి భోజన వసతికి అనేక సత్రాలు నిర్వహించేవారు. ఆలయం గ్రామానికి బాహ్యంగా ఉండటంచేత అచ్చటనే వీధి నాటకాలు, భజన సమాజాల వారి సంకీర్తనలు, ఎడ్లను ఆలయం చుట్టూ ప్రదక్షిణలు చేయించటం, మేళతాళాలతో ఊరేగింపులు మొదలయిన సంబరాలు మహాకోలాహలంగా జరిగేవి. మరల ఈ తిరునాళ్ళు ఎప్పుడు జరుగుతవా ! అని ఉత్సాహవంతులు ఉరకలు వేస్తూ ఎదురు చూచేవారు.

దొర కృషి ఫలితంగా ఆంధ్రదేశంలో దాదాపుగా ప్రతి గ్రామనికి కైఫియత్తు పేరిట స్థానిక గ్రామ కథనాలు వ్రాయించి సేకరించటం జరిగింది. నేడు ఏ గ్రామ చరిత్రను వ్రాయాలన్నా ఈ కైఫియత్తు ప్రధాన ఆధారమైంది. ఈ గ్రామ చరిత్రకు గూడ ఇదే ఆధారం. ఈ రచయిత గ్రామ కైఫియత్తునే గాక పరిసర గ్రామ కైఫియత్తులను గూడా స్పృశించి ఆనాటి గ్రామ చరిత్రను వెలికితీయ ప్రయత్నించారు.

క్రీస్తు పూర్వ శతాబ్దులలో భట్టిప్రోలు ఒక ప్రసిద్ధ బౌద్ధకేంద్రంగా గుర్తింపు పొందినది. దాని ప్రాచీన నామము ప్రతీపాలపురం. మొదట్లో జైన కేంద్రంగా ఉండేదని, తరువాత కాలములో బౌద్ధకేంద్రంగా గుర్తింపు పొందిందని చరిత్రకారుల అభిప్రాయం. అచ్చట ప్రభుత్వం నెరపిన రాజు కుబేరకుడు. ఇతడో, ఇతని వంశీయుడైన ధనధుడను

పేరుగల మరియొక రాజో, తనపేరున ఆ గ్రామానికి సమీపంలోనే మరొక గ్రామన్ని నిర్మాణం చేయించి ధనదపురమని నామకరణం చేశాడని, ఆ గ్రామమే కాలాంతరంలో సనదపురము, సనదవోలుగా రూపాంతరం చెంది, నేడు చందవోలు లేక చందోలుగా పిలువబడుతున్నదని చరిత్రకారుల అభిప్రాయము - అట్టి ఈ ప్రాచీన గ్రామం (క్రీ.శ. 11-12శ) మధ్య శతాబ్దుల్లో మహావైభవోపేత దశనంది వెలనాటి చోడులకు ముఖ్య పట్టణం అయి తీరాంధ్రంలో వారి రాజధాని నగరంగా వెలుగొందినది. రజకీయ పరిణామాలకు లోనైన నగరంగా చెప్పవచ్చు. అట్టి భట్టిప్రోలు - చందవోలులకు సమీపస్థమయిన ఈ గోవాడ - దగ్గుమిల్లి గ్రామం ఆయా ప్రదేశాలలో జరిగే మత, సాంఘిక, రాజకీయ పరిణామాలకు ప్రభావితం కాకుండా ఎలా మనగలదు ? కనుక ఈ గ్రామ కధనానికి పరిసర గ్రామ చరిత్రలను గూడ గణనలోకి రచయిత తీసుకున్నారని తలంచాలి.

ఈసందర్భంగా అలనాటి బౌద్ధ, జైన బసదులలోని పరిస్థితి, పండితారాధ్య కధనము, శైవ విజృంభణం, జైన బసదుల మీద "శైవమూకల" దాడి, వైష్ణవ సంఘర్షణలను ఉదహరించారు. ఆనాడు శైవులుగాని, వైష్ణవులు గానీ పెద్ద ఎత్తున మూక ఉమ్మడిగా ఉద్యమ సంఘాలుగా దండెత్తి అన్యమతస్థుల ధన, మాన, ప్రాణ హానిని తలపెట్టి వారిని కొల్లగొట్టి, నాశనం చేసారా ? లేక వ్యక్తిగత వైషమ్యాలతో - మతపరమైనవే అయినా - సంఘర్షణలకు దారితీసారా ? అన్న విషయం విచారాంశీయం. రచయిత వీనిలో మొదటి

శ్రీనాధ, దుగ్గనల సమకాలీనత, వారికి దగ్గుమిల్లి, చందోలులతో సంబంధం,

గ్రామ నిర్మాణంలో వాస్తు విశేషాలను, వెలనాటి రాజులకు నిధి నిక్షేపాలు లభించిన విధానం, తత్కాలీన కరణీకపు వ్యవస్థ, రాజుల దానశాసనాలు, వానిలోని చారిత్రికాంశాలను వివరించారు.

గ్రామ నిర్మాణకాల, ఆలయ నిర్మాణంలో వున్న శాస్త్ర సూక్ష్మాలను, ఇతర సమకాలీన వాస్తు విశేషాలను తులనాత్మకంగా ఉదహరించి చర్చించారు. అనేక ఇతర

పరిచయం చేయటంకన్నా మండల చరిత్రగా వ్యవహరించటం ఉత్తమం. ఈ సందర్భంగా అనేక విషయాలను వెలుగునకు తెచ్చి అందించిన రచయిత కాట్రగడ్డ బసవపున్నయ్య కృషిని మనసారా అభినందిస్తూ ...

.... పురాణం రాదాకృష్ణప్రసాద్

# ముందుమాట

"గోవాడ నుండి దగ్గుమిల్లి చరిత్రలోనికి" వ్రాయుటకు నా తల్లి గారు కాట్రగడ్డ పార్వతమ్మ గారి ప్రోత్సాహమే కారణము. దగ్గుమిల్లిలో నవగ్రహాలయ నిర్మాణమునకు ఆనాటి గ్రామ పురోహితుడైన శ్రీ సుబ్రహ్మణ్యం గారికి గల చిరకాల కోర్కెను తీర్చమని నాతల్లి గారు కోరుటచేత ఆ నిర్మాణమునకు రూపకల్పన జరిగినది. ఈ చరిత్రలో ఇంకనూ కొన్ని చారిత్రిక సత్య రహస్యములను ప్రత్యేక కారణములచే వదలితిని.

ఈ పుస్తకమును వ్రాయుటలో నాకు అనేక సూచనలు ఇచ్చి, సహకరించుటతోబాటు తమ అభిప్రాయములను గూడా వెలువరించిన గౌ॥ డా॥ పురాణం రాధాకృష్ణప్రసాద్ గారు పురాతత్వవేత్త; చరిత్ర పరిశోధకులు (కేంద్ర ప్రభుత్వ పురావస్తుశాఖ అసిస్టెంట్ డైరెక్టర్ - రిటైర్డ్) ; మరియు రాష్ట్ర స్థాయి ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత శ్రీ పాణుకుమాటి వెంకటసుబ్బయ్య గార్లకు గౌరవాభివందనములతో .....

....... కాట్రగడ్డ బసవపున్నయ్య.




పొణుకుమాటి వెంకటసుబ్బయ్య
రాష్ట్రస్థాయి ఉత్తమ ఉపాధ్యాయ
అవార్డు గ్రహీత,
రామలింగేశ్వరపేట, తెనాలి.


శ్రీయుతులు కాట్రగడ్డ బసవపున్నయ్య గారు రచించిన గోవాడ నుండి దగుమిల్లి చరిత్రలోనికి అను గ్రంథము ఎన్నెన్నో చారిత్రాత్మక విజ్ఞాన పరిమళాలు వెదజల్లుచున్నది. శతాబ్దములనాటి ప్రజల భాషకు, నాగరికతకు, వారి భౌగోళిక అవగాహనకు, ఆనాటి

్కది.

దగ్గుమల్లి నేడు ఓ అదృశ్య గ్రామం. అ గ్రామం దరిన నేడు గోవాడ గ్రామం వెలసింది. దగ్గుమల్లి ప్రాచీన చరిత్రపై సంపూర్ణ అవగాహన పెంపొందించు ప్రత్యక్ష లేదా పరోక్ష ఆధారములు అంతగా అందుబాటులో లేకున్ననూ, దగ్గుమిల్లి యను గ్రామము జైన, శైవ మత కలహాల బారినపడి, శిథిలమైనదని, దగ్గుమల్లి దుగ్గన యను కవి జన్మస్థలి యను రెండు

ముందు ఆవిష్కరింప జేసిన కృషీవలుడు ....... శ్రీ బసవ పున్నయ్య.

చరిత్రకు అంతరాత్మ సత్యము. ఏదో ఒకనాటికి సత్యము వెలుగుకు వచ్చునన్నది ఆర్యోక్తి. సత్యము కాలగర్భమున అనంతకాలము అజ్ఞాతవాసము చేయచందురు. కాలగర్భమున

అభినందనీయులు.

వీరి గ్రంథములో ఆ ప్రాంత అనేక స్థల నామాల ప్రశస్థి కానవస్తుంది. ఆ స్థలనామాలు కొన్ని ద్రావిడ భాషాపదములు, మరికొన్ని మరుగున పడిన ప్రాచీన తెలుగుపదములు. ప్రాచీన స్థలనామాలు నేటికి వాడుకలో నున్ననూ, వాటి అర్థములు తెలుసుకొనుట మిక్కిలి జటిలము. ఆనాటి సమాజ భాష, చారిత్రక సంస్కృతి, ప్రాంతీయ భౌతిక లక్షణాలు గ్రామ నామాలలో సప్తవర్ణములు సూర్య కాంతిలో మిళితమై వున్నతీరు నుండును. ఆనాటి జీవభాషలోని పదజాల అవగాహన లేనివారు గ్రామనామ పరిశీలన చేయలేరు. గతమున సర్వశ్రీ గిడుగు రామమూర్తి పంతులు, చిలుకూరి నారాయణరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, కందూరి ఈశ్వరదత్తు,

్నరు.

శ్రీ కాట్రగడ్డ బసవపున్నయ్య గారు కూడ ఆ పండితబాటన పయనించి, గ్రామనామార్థములను వివరించిన తీరు శ్లాఘనీయము. ముందు తరాల వారికి మార్గదర్శకము. రచయిత అనేక కైఫీయత్తులను కూడ తన గ్రంథమున ఉటంకించి యున్నారు. చదువరుల మనస్సులను ఆకట్టుకొనేటట్లు సాగిన వీరి గ్రంథ రచన భావితరాల వారికి ఒక విజ్ఞాన దీపిక కాగలదని విశ్వసిస్తున్నాను.

... పొణుకుమాటి వెంకట సుబ్బయ్య.

# విషయ సూచిక


| | | | పేజి నెం. |
|---|---|---|---|
| 1. | మెకంజీ జీవితము | .. | 04 |
| 2. | గోవు - సంబంధిత - నానార్థములు | .. | 05 |
| 3. | మరియొక దగ్గుమిల్లి - కుర్తి దేశమందు | .. | 06 |
| 4. | గోవాడ కైఫీయతు | .. | 06 |
| 5. | బౌద్ధము | .. | 11 |
| 6. | భట్టిప్రోలు | .. | 14 |
| 7. | ద్రవిడ మండలము | .. | 14 |
| 8. | జైన వసదులు | .. | 15 |
| 9. | జైన గ్రామ నిర్మాణముల - నైసర్గికము ( కైఫీయత్తులు అలపాడు- తురిమెళ్ళ - పెదగాదెలవర్రు - చినగాదెలవర్రు - బోదపాడు) | .. | 18 |
| 10. | దగ్గుమిల్లి - ఐస్తీ | .. | 20 |
| 11. | తుంగభద్ర - 2 | .. | 20 |
| 12. | వెలనాడు | .. | 20 |
| 13. | చందోలు - రాజరికము | .. | 22 |
| 14. | సంధిగ్ధతలు | .. | 25 |
| 15. | దగ్గుమిల్లి - మంచన | .. | 28 |
| 16. | దగ్గుమిల్లిపై - శైవులదాడి | .. | 30 |
| 17. | దగ్గుమిల్లి - దుగ్గన | .. | 33 |
| 18. | గోవాడ దగ్గుమిల్లిలు ఈశాన్యస్థలఃమును పోగొట్టుకొనుట | .. | 39 |
| 19. | పండితారాధ్య చరిత్ర | .. | 48 |
| 20. | కైఫీయతులు బుద్ధాం - చందవోలు | .. | 54 |
| 21. | కరణీకపు వ్యవస్థ - ఆరువేల వెలనాడు | .. | 58 |
| 22. | నూతన కరణీకపు వ్యవస్థ ఆవిర్భావము - గోవాడ | .. | 58 |
| 23. | చావలి కరాబ్ | .. | 60 |
| 24. | సదాశివరాయల-అగ్రహారదానము-గుంటూరు కైఫీయతు నుండి | .. | 61 |
| 25. | సదాశివరాయల - తామ్రశాసనము అగ్రహారీకులవద్ద నున్నది. | .. | 62 |

26. ఇతర దాన పత్రికలు:
1) యతమతరావు చిన వెంకన్న .. 68
2) మాణిక్యారావు, రఘుపతిరాయనింగారు .. 68
27. దగ్గుమిల్లి శిధిలాలు - పునరభివృద్ధి .. 70
28. శ్రీ బాలకోటేశ్వరస్వామి దేవాలయ నిర్మాణము .. 72
29. బ్రాహ్మణ అన్న ధర్మసత్రం .. 73
30. పద్మసాలీల ధర్మసత్రం .. 74
31. శ్రీ బాలకోటేశ్వర కన్యకాపరమేశ్వరి ఆర్యవైశ్య అన్నదాన సత్రం .. 74
32. నవగ్రహాల నిర్మాణము .. 75
33. గోవాడ గ్రామ వర్ణన - నైసర్గికము .. 82
34. గ్రామ చెరువులు .. 83
35. మంచినీటి బావులు .. 83
36. రహదారులు .. 84
37. గ్రామవాయవ్య ప్రాశస్త్యము .. 84
38. అంబరాయి .. 84
39. బళ్ళమ్మదేవత .. 85
40. శ్రీ కోదండరామస్వామి దేవస్థానము .. 86
41. శ్రీ రామమందిరము .. 86
42. శ్రీ వేణుగోపాలస్వామి దేవస్థానము .. 87
43. కాట్రగడ్డ వారి దేవత .. 88
44. గ్రామ పురోహిత నివాసము .. 88
45. గోవాడ - దగ్గుపల్లి చుట్టు గ్రామాలు .. 88
46. గ్రామనామము - ఏర్పడిన విధము .. 89
47. గ్రామదేవతావిర్భావ విధానము .. 94
48. గుంటూరు కైఫియతు - ప్రత్యేకత .. 97
49. గోవాడ - సర్వే విధానము .. 97
50. దుగ్గన - కాంచీ మహత్యము .. 99
51. సంకలనమునకు ఉపయోగించిన గ్రంథపట్టిక .. 101

# 1. మెకంజీ జీవితము

కల్నల్‌కొలిన్ మెకంజీ అను బ్రిటీసు వ్యక్తి లేకున్న గోవాడ చరిత్ర ఈమాత్రమైనను అందుబాటులో ఉండేది గాదు. మత సంఘర్షణలలో, నిరంతర యుద్ధ నీడలో శతాబ్దములకు శతాబ్దములు గడుచుచు పరమత సంస్కృతిని నామరహితముచేసుకొనుటలో మన వారి ముందు పొరుగువారేపాటి.

మెకంజీ 1783లో ఈష్టిండియా కంపెనీలో మద్రాసు నందు ఇంజనీరుగా జీవితమును ప్రారంభించి, దక్షిణభారత దేశము అంతయూ తిరిగెను. అతని ప్రయాణములో అనేక స్థంభములు, శాశనములు రాళ్ళపై ముఖ్యముగా దేవాలయముల వద్ద ఉండుటను చూచి శ్రీ కావలి వెంకట బొర్రయ్య ఏలూరి నివాసి అతని సోదరులు లక్ష్మయ్య, రామస్వామి అనువారిని నియమించగావారు కోస్తా ఆంధ్ర ; రాయలసీమ ప్రాంతములను పర్యటించి అచ్చటి గ్రామ శాసనములను శిలా, తామ్ర వగైరాల సంగతులను సేకరించి అచ్చటి కరణాలు దస్కతులతో వ్రాయించిరి. తదుపరి మెకంజీ 1810లో సర్వేయరు జనరల్ ఆఫ్ మద్రాసుగాను, 1816లో సర్వేయర్ జనరల్ ఆఫ్ ఇండియాగాను పనిచేసి 1821లో కలకత్తాలోని చౌరంగా వద్ద మరణించెను.

వీరి కాలములో తమిళ, తెలుగు, కన్నడ లిపులలోని 1568 చేతివ్రాతలు, 8076 ఇన్స్క్రిప్షన్సు, 2630 డ్రాయింగ్సు, 6218 నాణెములను సేకరించెను.

స్థానిక కరణములచే వ్రాయించబడిన స్థానిక చరిత్రలలో కొన్ని లోపములు దొర్లిననూ, షుమారు 200 సం॥ము క్రితము పరాయి దేశస్తునిచే సేకరించబడిన గాధలు, కొంతవరకైనా భూస్థాపితగాధలను వెలికితీయుటకు చారిత్రికాన్వేషకులకు తోడ్పడుచున్నవి. అట్టి మహనీయుని తలిచి ముందుకు సాగుదము.

# 2. "గోవు" - సంబంధిత నానార్ధములు

గోవాడ (గోసాని కాపురం - గోవులవాడ - గోవాడ) + దగ్గుమిల్లి (దగ్గుమిల్లి, దగ్గుపల్లి, దగ్గుబల్లి, దగ్గుమిల్లిపాడు) కలిసిన ఓనాటి శ్రీ భాష్యపురం చరిత్ర దీపావళి చిచ్చుబుడ్డిలా వెలిగినదొకనాడు; పరిసర గ్రామాల మధ్య అందులో నుండి ఉద్భవించినది శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయము. దాత ఉద్దేశ్యములకు కేంద్రబిందువు కాలేకపోయినా, నేడు నామమాత్రావశేషముగానై - ఆ ఆశయములు షుమారు 500 సం॥ములు గ్రామమునకెంతో ఉపకరించినవి. గ్రామస్తులు - ఆ వృక్షముల నీడలో సేదతీరినారు.

గోవాడ గోవుశబ్దము నుండి ఉద్భవించినది కనుక ముందుగా గోవును గూర్చి కొద్దిగా తెలుసుకొనెదము.

గోవాడను - గోవులవాడ - (ధవళిపురి) అని పిలిచెడివారు. వారికి ఇష్టమైనవి మరియు జీవనాధారమైనవి. గోవులు, ఎద్దులు. వాటి పేర్లను ప్రాచీనులు ఎన్నిరకముల పిలిచెడివారో భారతీయ వ్యవసాయ చరిత్ర కర్త ( నామలింగాను శాసన, వైశ్యవర్గు, కౌటిలియార్థ శాస్త్రముల నుండి గ్రహించిన దానిని ఇచ్చుట ఉదహరించుచుంటిమి.

ఔక్షవము - ఎద్దుల గుంపు, గవ్యా - ఆవుల గుంపు, వాత్సకము - లేగల గుంపు (ఒక్కొక్కదానినే గుర్తుపట్టవలసిన యెడల) మహోక్షము - పెద్దయెద్దు, జాతోక్షము - బలిసిన యెద్దు, తర్ణకము - అప్పుడు పుట్టిన లేగ, శకృత్కరి - ఏడాది వయస్సు దాటని దూడ, దమ్యము - దున్నెడి యీడుగల గిత్త, ఆర్షభ్యము - ఆబోతగుటకు దగిన యెద్దు, ఇట్చరము - ఆబోతు, నస్యోతము - ముక్కునకు త్రాడు గ్రుచిన్నన యెద్దు, ప్రష్ఠవాట్ - దున్నుట, మోయుట నేర్చుకొనుచుండిన యెద్దు, శాకటము - బండియెద్దు, ప్రాసంగ్యము - దున్నెడి యెద్దు, 2 అశ్వము - చురుకుగ నడచు యెద్దు, అశ్వతరము - వేనడమువలె పరుగెత్తెడి యెద్దు.

3 ఇట్టి విభాగములే యావులకును గలవు. నైచికి - మంచి యావు, సళ - గొడ్డావు, అవతోక - దైవవశమున నీచుకొనిపోయిన యావు, లేహత్ - ఆబోతెక్కుటచే

నీచుకొనిపోయిన యావు, సంధిని - ఎదబోవు యావు, ఉపసర్య - పొర్లదగియున్న యావు, ప్రష్ఠౌహి - లేజూడియావు, పరేష్టుక - పెక్కీత లీనినయావు, ద్రోణదుఘ - నాలుగుశేర్ల పాలిచ్చునావు, (కౌటిల్యుని వ్యావహారిక ద్రోణము 187 పలముల యెత్తు). సమాంసమీనా ప్రతి వత్సరము ఈను ఆవు ఇటులనే, యేండ్ల ననుసరించి ద్విపర్షీ, త్రివర్షీ, మొదలగు పేర్లు పెట్టుచుండిరి.

ప్రస్తుతము మనకు కర్రెద్దు, మచ్చలు, వెలపడ, దాపడ, వగైరాలు మినహా అతి తక్కువ తెలుసునని ఇకముందు వారికి యంత్రయుగములో ఇవి కూడా మరిచిపోవురోజులు రాబోవుచున్నవనుటకు ఉదాహరణ ప్రస్తుతము గ్రామము నందు గోవుల కన్నను ఎక్కువ సంఖ్యలో ట్రాక్టర్లు ఉండుటయే.

# 3. మరియొక దగ్గుమిల్లి - కుర్తిదేశము నందు

**<u>కుర్తిదేశము :</u>**

అనవేమారెడ్డి ద్రుజ్జవరము శాసనములో కుర్తిదేశము పే

ద్రుజ్జవరము 'మలాపహారీతయే కుర్తీదేశే', గ్రామోయమేధతే" అని మలాపహారియొద్దున కుర్తీదేశము నందీ గ్రామము వర్ధిల్లుచున్నదని చెప్పబడినది. ఈ ద్రుజ్జవరము శాసనములో పేర్కొనబడిన పెరిశపల్లి, కావవరము, <u>దగ్గుమిల్లియు</u> గుడివాడతాలూకాలోనే గలవు. ఈ మలాపహారియే పుల్లేరు కావచ్చును. కుర్తీదేశము గుడివాడ తాలూకా ప్రాంతము కానోవును. (1) రెడ్డి సంచిక, అనుబంధము. పుట 31-33.

E. I. Vol. XXV. No.13 అనపోతారెడ్డి కోడూరు శాసనము.

# 4. గోవాడ కైఫీయతు

# కైఫియ్యతు మౌజె గోవాడ సంతు పులిపర్రు

యిప్పుడు బస్తీగా వుంన్న మజుకూర్కి దక్షిణభాగమంద్దు ఘుడీయదూరాన వుండుకుంన్న దగ్గుమల్లిపాడు అనె దిబ్బ పూర్వం దగ్గుమల్లి అనె గ్రామం నామం

వహించ్చగా జయనులు కాపురం చెశినారు జయనులు మొదలయ్ను వారివల్ల ఆపట్నం బస్తీగా వుండ్డేటప్పుడు అనాదియైనటువంట్టిశ్రీరాములవారి ఆలయము వున్నందున్ను శ్రీ సోమేశ్వరస్వాములవారి. శివాలయము వుండ్డెది గన్క అప్పట్లో అత్యంత్త వుత్సవములు జర్గుతూ వచ్చెవి తదనంత్తరం జయనులు ఖిలమైపోయినందున్ను ఆ స్తలమంద్దు వున్న ప్రజల్కు భ(జ)యం లెనందున్ను తత్పూర్వమంద్దే యిప్పుడు బస్తిగా వున్నచోట పశునిలయములు యెర్పాటరచుకుని వుండ్డుటవల్లఆత్యంత్త వృద్ధికరంగ్గా వున్న హెతువవల్లనుంచ్చిఆ దగ్గుమల్లి వదలి యిక్కడ బశ్తిచెశి గోవాడ అనె నామం యెర్పాటరుచుకుని నివాసంగ్గా వుండ్డి వున్నారు. తధారభ్యా సదరహి దగ్గుమల్లి జనరహితంగ్గా వుండ్డివున్నంద్దున దగ్గుమల్లిపాడు అని యిదివర్కు వాడుకగా వుండి వున్నది. ఆ స్తలమంద్దు పూర్వం వున్న దెవాలయము ఖిలమయి పానవట్టె సహితంగ్గా లింగ్గమూర్త్తిన్నీ విఘ్నెశ్వరుడున్ను ఆంజనెయ విగ్రహమున్ను వుండి వున్నవి ఆ స్తలం కొంచ్చం వున్నతంగ్గా దిబ్బగా వున్నది గన్కు ఆ చోట తవ్వితె వింక్కిరాళ్లు అగపడుతూ వున్నవి యీ దేశమ్కు వడ్డెరెడ్డి ప్రభుత్వములు జరిగె యడల గజపతి గణపతి గారి ప్రభుత్వంలో మహాప్రధానులైన గోపరాజు రామంన్నగారు శాలీవాహనం ౧౧౬ శకం (1145 క్రీ.శ.) అగునెటి రక్తాక్షినామ సంవ్వత్సర భాద్రపద బ ౩౦ జయవారం సూర్యోపరాగ మహా పుణ్యకాలమంద్దు గణపతి వారి దగ్గిరదానధార పూర్వకంగా గ్రహించ్చి సమస్తమయ్ను వైదికుల్కు నియోగల్కు బ్రాహ్మణ కరణీకములు సంస్థాపించ్చె యడల యీ గ్రామాన్కు అశ్వలాయ్ను సూత్రోద్భవులున్ను రుక్శాఖాధ్యయనులున్ను కాశ్యపగోత్రో ద్భవులున్ను లయ్ను కూచిపూడి అగస్త్యరాజు అనె నంధ్ధవరీకుడ్కి కరిణికపు మిరాశీన్నీయించ్చిరి గన్కు తదారభ్యానెటి వర్కు వారి వంశీకులె గ్రామనామాస్వయులై మిరాశీల వాజుమాలు అనుభవిస్తూ వున్నారు.

తదనంత్తరం కర్నాటక్కు ప్రభులైన కృష్ణదేవమహా రాయులంగ్గారు స్కల దేశములు అధికారం చెస్తూ వుండ్డె తదనంత్తరం అచ్చుతదెవ మహారాయులు రాజ్యం చెశ్ని తర్వాతను సదాశివ దెవ మహారాయులుం గారు ప్రభుత్వాన్కి వచ్చి ౧౪౬౬ (1544 క్రీ.శ.) అగునెటి క్రోధినామ సంవ్వత్సర పుష్యకు ౧౫ ఆదివారంనాడు శ్రీమద్వెదమార్గ్గ ప్రతిష్టాపనాచార్యోభయ వెదాంత్త ప్రవర్త్తకులయ్ను అశ్వలాయన సూత్రీకులయ్ను రుక్శాఖాధ్యయనులున్ను కాస్యపగోత్రపారం పర్యులున్ను అయ్ను

చిలుకమఱ్ఱి వల్లభాచార్యులు అయ్యావార్లఁగార్కి సర్వాగ్రహారములుగా యీ గోవాడ అనె గ్రామమున్ను అంక్కెల కూరపాడు అనుమల్లఁపూడి యీ మూడు గ్రామాదులు సహిరణ్యోద్క పూర్వకంగ్గాను దానం యిచ్చి తమ ధర్మములు అచంద్రాక్కఁ స్తాయిగాను జర్గవల శ్నిందుక్కు తాంమ్రశాసనములు వ్రాయించ్చి యింప్పించి నారు గన్కు ఆయన మజుకూరిలోకి వచ్చి సకుటుంబ్బ సమేతంగ్గా నివశించ్చి యీ గ్రామానకు శ్రీభాష్యపురం అనె ప్రతినామం యెర్వఁరచి యీ గ్రామంవల్ల వచ్చె ఫలశ్రాయి అనుభవిస్తూ కాంచ్చి దేశములో చోళంగ్గివరం అనె గ్రామంలో నుంచ్చి సంత్తాన గోపాలం అనె శిలావిగ్రహాంన్ని తెప్పించి రుక్మిణీ సత్యభామా సహితంగ్గా ప్రతిష్ట చేశే నిమిత్తం ఆలయములు కట్టించ్చి శాలివాహనం ౧౪౭౧ (శ.క. 1549 క్రీ.శ.) యందు సౌంమ్యనామ సంవత్సర శ్రావణ శు ౧౦ శ్తిరవారం న ప్రతిష్ట చెయ్యించి పూర్వం దగ్గుమల్లిలో శ్రీరాములవార్కి అర్చఁనచెస్తూ వుండె గోవాడ ఆదింన్న అనె వైఖానసుడు దౌహిత్రిభాగంగ్గా అహూగెయ సూత్రోద్భవులుంన్ను యజుశ్శాఖాధ్యయనులుంన్ను గౌతమస గోత్రీకులుంన్ను అయ్ని దివి వెంక్కటాచార్యుల్ను అర్చఁ కత్వానికి నియమించ్చినంద్ను వారు మిరాశిగా వుండి పరంపరా యిదివర్కుంన్ను అర్చఁకత్వం చేస్తూ వుంన్నారు. వీరికి జీవనం జర్గగలందుల్కు స్వామి వారి నిత్య నైవేద్య దీపారాధనుల్కు మజుకూరిలో అయిదు కుచ్చెల పొలమున్నూ సాల్కు నగదువో ౧౨ పంన్నెండు వరహాలుంన్ను యెపఁరచి అళ్వారులను అయిదుగుర్ని యెర్పాటు చెశినారు సదరహీ వల్లభాచార్యులుంన్ను అయ్ని కొమారుడు రామానుజాచార్యులు గారుంన్ను శాలివాహనం ౧౫౪౦ (1618క్రీ.శ.) అగునెటి సంవ్వత్సరం వర్కు నిరాటంక్కముగా అనుభవించ్చినారు. సదరహి రామానుజాచార్యులు కొమాళ్ళు అయ్ని వల్లభాచార్యులు వెంక్కటాచార్యులుంన్ను యీ దేశములు మెచ్ఛ ప్రభువుల యొుక్క అడావుడిగా వుండ్డి వునంద్ను సకలమయ్ని ప్రజలు ప్రఛన్నత్వమును సహించ్చిన సమయమంద్దు దక్షిణాదిలో కాంచ్చి దెశమంద్దు వుంన్న శిష్యులు వున్నందువల్ల శిష్య సంచ్చారంగ్గా సదరహీ అగ్రహారీకులు యీ స్తలం వదలి వెశినారు గన్కు అప్పట్లో యీ అగ్రహారములు శెరిలో దాఖలు అయ్నిది.

తదనంత్తరం తానెషహా వారి అధికారంలో అక్కంన్న మాదంన్న గారు వజీరులయి వుండ్డగా ...... తరావు చిన్న వెంక్కన్న గారు .... హోదాలో ప్రభలులైవున్నంద్ను అయ్నుకు మజ్కూరు మొఖాసా యిచ్చిరి గన్కు వారి అధికారం జర్గుతూ వుండగా సదరహి అగ్రహారీకులు దక్షిణాది నుంచ్చి తిర్గి వచ్చి తానెషావార్కి అర్జీ చెసుకోవలెనని విచారిస్తూన్నంత్తలో వెంక్కన్న గారు అగ్రహారీకుల్ను సమాధాన పరచి శాలీవాహనం ౧౬౧౬ (1694 క్రీ.శ.) అగునెటి విరోధి సంవ్వత్సరం వైశాఖ శు ౧౦ సోమవరాంనాడు మజ్కూరికి మూడు కయిలు కుచ్చళ్ళ పొలముంను గ్రామంలో కయిలు అయ్ని గల్లా ఖ ౧కి రెండు మానెల చొప్పున జరిగేటట్టుగా నిర్నయింఛ్చి ధర్మశాసనం స్నదు వ్రాయంచ్చి యిప్పింఛ్చినారు గన్కు ఆ ప్రకారం వారు అనుభవిస్తూ వచ్చినారు. శ్రీ స్వామివార్కింన్ని పూర్వం అగ్రహారికులు చెశ్ని మామూలు ప్రకారం గర్గింఛ్చినారు. పూర్వం రామరాయుల నాటనుంచ్చి వుండ్డె మాణీక్యారావు వార్కి దెశముఖి మంన్నెవారి హోదాలు యెవర్తిస్తూ వుండిరి గనుక వారి వంశీకుడు వెంక్కంన్నా మాణిక్యారాయనింగారు ప్రభుత్వం చెశె సమయమందు మజుకూరిలో అగ్రహరికుల్కు వుండె వృత్తులు జప్తుచెసుకుని తిర్గి కయిలు కుచ్చళ్ళ పొలానకుంన్ను మామూలు ప్రకారం... కింన్ని స్న ౧౧౪౧ ఫసలీ (1731 క్రీ.శ.) స్నదులు వ్రాయంచ్చి శ్రీ స్వామివారికింన్ని మామూలు ప్రకారం ఆయ్ను కొమారుడయ్ని తిరుపతి రాయనింగారి కొమాళ్ళు రవణప్ప గారుంన్ను మల్లన్నగారుంన్ను శీతంన్నగారుంన్ను అప్పా రాయినింగారున్ను అచ్చంన్నగారు వెంక్కప్పగారు కిచ్చయ్య గారు వీరు యెడ్డురులో అప్పారాయనింగారు నిస్సంత్తుంగా చనిపోయినారు. గన్ను తతింమ్మావారు తాలూకా పంచ్చుకోవలెనని యత్నం చెశిరి గన్కు అచ్చంన్నగారు కిచ్చయ్య గారు మాకు వంట్లు అక్కరలెదు అని అన్నంద్ను శితంన్నగారు రేవల్లె వంట్టుంన్ను మల్లంన్నగారు రాచూరు వంట్టుంన్ను వెంక్కప్పగారుంన్ను రమణప్పగార్కి వచ్చెటివంట్లు రెండ్డు భాగాలవారికింన్ని యీ ప్రకారం పంచ్చుకొన్నందున్న రాచూరు వంట్టుకు అధికారం చెశె మల్లంన్న గారు కొంన్ని ద్నిములు ప్రభుత్వం చెశ్ని తర్వాత యీయ్ను కొమాళ్ళు అయ్ని రఘుపతి రాయనింగారు ప్రభుత్వం చెశె ద్నిములలో మజ్కూరు రాచూరు వంట్లులో చెరివుంన్నంద్ను మజ్కూరు అగ్రహారీకులు పూర్వం వుంన్న వృత్తులు జప్తు

చెయించ్చి అందుకుగాను 1/2 కుచ్చల భూమి శాలివాహన శకం ౧౬౭౭ శకం (1755 క్రీ.శ.) న్న ౧౧౬౪ ఫసలీ (1754 క్రీ.శ.) లో స్నదులు వ్రాయించ్చి వెంకటరమణాచార్యుల గార్కి యిప్పించి స్వామివార్కి వుండెవృత్తులు నిరాటంకంగా జరిగిస్తూ యీ ప్రకారం కొంన్ని సంవత్సరములు ప్రభుత్వం చెశి యీన తంమ్ములయ్ని తిరుపతి రాయనింగారికింన్ని నిస్సంత్తు అయ్నింద్ను సదరహి అచ్చంన్న గారి కొమాళ్లు అయ్ని పానకాల రాయునింగారు గురువారాయనింగారుంన్ను పూర్వం నుంచ్చి వీరి దగ్గిరనె వుండివుంన్నారు గన్కు తదనంతరం యీ వంట్టుకు అధికారులై కొంన్ని ద్నిములు ప్రభుత్వం చెశి చనిపోయినారు. పానకాల యానింగార్కి యిద్దరు కొమాళ్ల వుండ్డి వారు బాలులయ్నింద్ను అధికారంలోకి రాకుండ్డానె వారుంన్ను గతించ్చి పోయినారు. తదనంతరం రేపల్లె వంట్టుకు అధికారియైన శీతంన్న మాణిక్యారాయునింగారి కుమాళ్లు జంగ్గన్నా మాణిక్యారాయునింగ్గారు రేపల్లె పెటెరు రాచూరు యీ వంట్లకు యెక ప్రభుత్వముగా న్న ౧౧౬౮ ఫసలీ (1759 క్రీ.శ.) మొదలుకొని న్న ౧౧౮౩ ఫసలీ (1773 క్రీ.శ.) వర్కుపద్నాల్గు సంవ్వత్సరములు ప్రభుత్వం చెశ్ని మీదట యీయ్న తమ్ముడు అయ్ని తిరుపతి రాయనింగ్గారు తాల్లూకా పంచ్చుకోవలెనని కల్త చెశ్నిందున తాలూకా రెండ్డువంట్లు చెశి రాచూరు వంటు వెంకటపతిరాయనింగార్కి వంచిపెట్టి నంద్ను మజ్కూరు రాచూరు వంట్టులో చెర్నింద్నున్న ౧౧౮౩ ఫసలీ (1773 క్రీ.శ.) లగాయతు న్న ౧౨౦౧ ఫసలీ (1791 క్రీ.శ.) వర్కు ౧౮ సంవ్వత్సరములు రాజ్యంచెశి చనిరి గన్కు ఆయన కొమాళ్లు అప్పారాయనింగారున్ను న్న ౧౨౦౪ ఫసలీ (1794 క్రీ.శ.) వర్కు 3 సంవ్వత్సరములు ప్రభుత్వం చెశి చనిపోయ్నింద్ను ఆయ్న తమ్ములయ్ని శీతయ్యగారు న్న ౧౨౦౮ ఫసలీ (1798 క్రీ.శ.) వర్కు ప్రభుత్వం చెశిరి రెపల్లె తాలూకా ప్రభుత్వం చెశ్ని జంగ్గంన్నా మాణిక్యారాయనింగారి కొమాళ్లు అయ్ని భావన్నామాణిక్యారాయనింగారు యీ వంట్టుకు కూడా న్న ౧౨౧౧ ఫసలీ (1801 క్రీ.శ.) వర్కు ప్రభుత్వం మూడు సంవ్వత్సరములు చెశిన మీదట యీవంట్టు మహారాజశ్రీ కుంఫిణీవారు వెలం వెయించ్చినారు గన్కు వెలాంలో రాజా మల్రాజు వెంక్కట గుండ్డారాయనింగార్కి వెలంలో వచ్నిది గన్కు యిదివర్కుంన్ను న్న ౧౨౨౦ ఫసలీ (1810 క్రీ.శ.) వర్కు

వీరి ప్రభుత్వం జరుగుతూ వుండి శ్రీ స్వామివార్కి పూర్వం నుంచ్చి జరుగుతూవుంన్న వృత్తులు నిరాటంక్కముగా జరిగిస్తూ వుంన్నారు.

ప్రజోత్పత్తినామ సంవత్సర వైశాఖ బ ౧౩ సోమవారం.

ది ౨౧ మెయి ఆ.న. ౧౮౧౧ సంవత్సరం.

పై గోవాడ కైఫీయత్తునుబట్టి క్రోధినామ సం॥మున సదాశివరాయులచే గోవాడ దానము క్రీ.శ. 1544 నను, భావనామ సం॥ము 1694 యతమతరావు చిన వెంకన్నగారి శాశనము; యువనామ సం॥ము 1755న మాణిక్యరావు రఘుపతిరావు గారి శాశనము నిలుచుచున్నవి కాని సం॥ము అంకెలు అచ్చుతప్పులు జరిగినవి. పై విషయ సం॥ములు నేటి నుండి లెఖ్ఖించిన తెలియనగును.

## 5. బౌద్ధము

క్రీస్తుకు పూర్వము 6వ శతాబ్ధి నుండి క్రీస్తుశకము 3వ శతాబ్ధివరకు బౌద్ధ యుగము అనవచ్చును. క్రీస్తుకు పూర్వము 473న బుద్దుని నిర్యాణము జరిగెనని తెలియుచున్నది.

ఆంధ్రదేశములో ధాన్య కటకము - భట్టిప్రోలు - గుంటుపల్లి - శంకరం - శాలిగుండం - రామతీర్థం - ఘంటసాల - గోలి - గుమ్మడిమద్రు - అల్లూరు - నాగార్జునకొండ - ధూళికట్ట - గాజులబండ - నేలకొండపల్లి - చందవరం ఒకనాటి బౌద్ధ సంస్కృతికి నిదర్శనాలు, కాగా వీనిలో ధాన్యకటకము - భట్టిప్రోలు - గోలి - నాగార్జునకొండలు గుంటూరు జిల్లాలోనివి. అందు భట్టిప్రోలు గోవాడకు (దగ్గుమిల్లికి) అతిదగ్గరలోనిది.

ప్రాచీనతలో పరిమాణంలో పవిత్రతలో ధాన్యకటక స్థూపం తరువాత చెప్పదగింది. భట్టిప్రోలు స్థూపం - భట్టిప్రోలు గుంటూరు జిల్లా గుంటూరు - రేపల్లె రైలుమార్గం మీద కృష్ణానది వాలుకి కుడివైపున మూడు మైళ్ళ దూరాన ఉంది. ($16^{0}.6'$ ఉత్తరఅక్షాంశం $80^{0}.4'$ తూర్పురేఖాంశం) ప్రాచీన జైనకావ్యాల్లోని ప్రతీపాలపురం, ఖారవేలుని హతిగుంఫ శాశనంలోని ప్రిథుడ నగరం, టాలెమీ పేర్కొన్న పిటింద్ర భట్టిప్రోలుయే అయి ఉన్నదని చరిత్రకారుల భావన.

మగధలో పుష్యమిత్రశుంగుడు, ప్రతిష్ఠానంలో మొదటి శాతకర్ణి పాలిస్తున్న కాలంలో చేది (మేఘవాహన) వంశస్థుడయిన ఖారవేలుడు కళింగాధిపతి అయ్యాడు. ఇతడు క్రీస్తు పూర్వము 175 ప్రాంతములో కళింగసింహాసనమెక్కెనడానికి అవకాశముంది.

పదో రాజ్యసంవత్సరములోనే ఖారవేలుడు ద్రమిళరాజ్య కూటమిని ఓడించాడు. ప్రిథుండ నిర్మూలనము, ద్రమిళకూటమి విచ్ఛిన్నం ఒకేదండయాత్రలోని సంఘటనలై యుండవచ్చును. ప్రాచీన యుగంలో నెల్లూరు వరకు ద్రవిడ దేశంగా వ్యవహరించేవారు. ద్రవిడ దేశాల నుండి తైర్థికులు ఆంధ్రదేశంలోని బౌద్ధక్షేత్రాలను దర్శిస్తున్నట్లు అమరావతి శాసనల నుండి తెలుస్తున్నది. ఆంధ్రద్రవిడ దేశాల మధ్య సత్‌సంబంధాలకిది నిదర్శనము. ఖారవేలుడు ప్రిథుండ నగరముపై దండెత్తగా, ద్రావిడ రాజ్య కూటమి, ప్రిథుడరాజ్యానికి సహాయంగా వచ్చి, ఖారవేలునిచే పరాజయం పొందినట్లు నిర్ణయించవచ్చు. ఈవిజయానంతరమే ప్రిథుడనగరాన్ని గార్దభలాంగలాలతో ఖారవేలుడు దున్నించాడు. కృష్ణానదీతీరంలో ఉండి, బుద్ధుని శారీరక అవశేషాలపై నిర్మితమైన మహాస్థూపంతో పవిత్రమైన ప్రతీపాలపుర బౌద్ధక్షేత్రం - బౌద్ధమత చరిత్రపుటల నుంచి అచిరకాలంలో అంతర్ధానంకావడానికీ విషాద సంఘటనే కారణమయి ఉంటుంది. నేటి భట్టిప్రోలే ప్రాచీన ప్రతిపాలపురం. ప్రతిపాలపురం జైన-బౌద్ధాల మధ్య సంఘర్షణకు రంగస్థలమై జైనం పరాజయమైనందువల్లనే ప్రిథుడ జైనమతాభియైన ఖారవేలుని దురాగ్రహానికి గురి అయింది. ప్రిథుడనగరం గ్రీకు రచనల్లోని పిటింద్ర నగరము ఒక్కటేనని చరిత్రకారుల నిర్ణయము. పిటుంద్ర మైసోలియాప్రాంతములోని ప్రముఖ నగరమని వస్త్ర పరిశ్రమకు, వాణిజ్యానికి కేంద్రమని గ్రీకు రచనలు పేర్కొంటున్నాయి.

బౌద్ధంలో నానాటికి వచ్చిన మార్పులు సయితం బౌద్ధమత క్షయానికి కారణాలయ్యాయి. రెండోశతాబ్దానికే బౌద్ధంశాఖోప శాఖలయింది. స్వీయశాఖాభిమానంతో బౌద్ధచార్యులు వాదోపవాదాల్లో పరస్పర ఖండనల్లో మునిగి, మతాప్రచారం నిర్లక్ష్యం చేశారు. మహాయానంలో బుద్ధుడు భగవంతుడయ్యాడు.

బౌద్ధ - బ్రాహ్మణ మతాల మధ్య భక్తి ప్రధానలక్షణమై ఉభయమతాల మధ్య వారధిగా పనిచేసింది. బౌద్ధం వ్యక్తిత్వము కోల్పోయింది. సామాన్యుల దృష్టిలో బ్రాహ్మణ బౌద్ధమతాల మధ్య వ్యత్యాసం నశించింది.

క్రీస్తుశకం, నాలుగైదు శతాబ్దాల్లో ఉత్తరావథాన్ని గుప్తరాజులు పరిపాలించారు. గుప్తరాజులు వైష్ణవ మతాభిమానులు, వారి ప్రభావం వల్ల బ్రాహ్మణ మతానికి వైష్ణవ ముద్ర పడింది. ఈ కాలంలోనే వాసుదేవ - నారాయణ - విష్ణుసమన్వయం జరిగింది. అవతారసిద్ధాంతం ప్రజల్లో విరివిగా ప్రచారమయింది. గుప్తరాజులకు సమకాలికంగా ఆంధ్రదేశాన్ని పాలించిన విష్ణుకుండినులు శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతులు. శ్రీపర్వతస్వామి నాగార్జున కొండపైనున్న బుద్ధదేవుడేననడానికి స్పష్టమైన ఆధారాలున్నాయి. మతంలో జరుగుతున్న ఈ పరిణామాల ఫలితంగానే బుద్ధుడు విష్ణుమూర్తి అవతారమయ్యాడు. అగ్ని ; భాగవత, వరాహపురాణాలు బుద్ధుని అవతారాల్లో చేర్చి ప్రస్తుతించాయి

క్షీణదశలో నున్న బౌద్ధము మీద ఏడు ఎనిమిది శతాబ్దాలలో తిరిగి బహుముఖముగా దాడులు జరిగాయి. సైద్ధాంతికంగా - బౌద్ధమతాన్ని, బుద్ధుని అప్రతిష్టపాలు చేయడము బౌద్ధవిహారాలను ఆక్రమించి ధ్వంసం చేయడము ఈ ఉద్యమ లక్షణాలు. సుప్రసిద్ధమీమాంసకుడైన కుమారిల భట్టుప్రారంభించిన దాడిని అద్వైత సిద్ధాంత స్థాపకుడైన శంకరాచార్యులు కొనసాగించారు. స్వప్నంలోనైనా బుద్ధుని చూడటం అమంగళ ప్రదమని "యాజ్ఞవల్క్యస్మృతి" హెచ్చరించగా "స్మృత్యర్థసార" బౌద్ధులను అస్పృశ్యులుగా పేర్కొన్నది.

బౌద్ధం ఈవిధముగా క్షీణదశకు రాగా, 12వ శతాబ్దంలో తీవ్రవాదశైవుడైన మల్లిఖార్జున పండితారాధ్యుడు జరిపిన ఒకపెద్ద మతజైత్రయాత్ర చందోలు వెలనాటి రాజుల ఆస్థానంలో పండితునకు బౌద్ధాచార్యశిష్యునకు మతచర్చ జరిగినట్లు అనంతరం పండితుని శిష్యులు బౌద్ధాచార్యుని హత్యచేసినట్లు పండితారాధ్య చరిత్ర చెబుతున్నది. చందోలు సమీపంలోని బుద్ధాం బౌద్ధాచార్యుని స్థావరమై వుండవచ్చు. పండితుని జైత్రయాత్ర ఝుంఝామారుతంలో ఆంధ్రదేశంలోని బౌద్ధమతావశేషాలు నశించినట్లు కన్పిస్తుంది.

## 6. భట్టిప్రోలు

ఆంధ్రప్రదేశమున పురాతన బౌద్ధక్షేత్రములలో నొకటి. గుంటూరు మండలములో రేపల్లె తాలూకా యందు కలదు. దీనికి ప్రతిపాలపురమను నామాంతరము గలదు. ఇచ్చట బౌద్ధస్తూపమునందు లభించిన ధాతుకరండముల మీద వ్రాయబడిన బ్రాహ్మీలిపిలోని ప్రాకృత శాసనములు లభించినవి. ఈ భట్టిప్రోలు శాసనముల పరిష్కరించిన బూలర్ పండితుడు ఈ లిపికి ద్రావిడి బ్రాహ్మిలిపి యని పేరిడెను. ఈశాసనములు క్రీస్తుకు పూర్వము రెండవ శతాబ్ద కాలమునకు జెందియుండెనని యా పరిశోధకుని యభిప్రాయము. ఈ స్తూపమున్న ప్రదేశమును లంజదిబ్బయని నేటి ప్రజలు పిలుతురు.

(1) Luder's Lists. Nos. 1329 - 1339 E. I. Vol. X.

(2) South Indian Buddhistic Antiquities in
Krishna Dt. Archaeological Survey of India Vol. XV.

## 7. ద్రవిడమండలము

నాగార్జునకొండ ఇక్ష్వాకుల ప్రాకృత శాసనములలో నీదేశమునకు దమిళమనియు, ఖారవేలుని హాతిగుంఫ శాసనములో త్రమిరమనిన్ని, కీర్తివర్మ శాసనములో ద్రమిళమనిన్నీ పేర్లు గలవు. త్రమిరమె తమిరమై తరువాత తమిళమయ్యెను. ద్రమిళమే ద్రవిడమయ్యెను. ద్రవిడ మండలమున కుత్తరమున సువర్ణముఖి నదియు, దక్షిణమున దక్షిణాపినాకినియు, పడుమట తూర్పు కనుమలును, తూర్పున సముద్రము సీమలై యుండెను. అనగా నిప్పటి నెల్లూరి మండలములోని దక్షిణ ప్రాంతమును, మద్రాసు రాష్ట్రములోని చెంగల్పట్టు జిల్లాయును, ఉత్తర, దక్షిణార్కాడు మండలములలోని గొంత భాగమునైె వ్యాపించియుండెను. ద్రావిడ మండలమన్నను తొండమండలమన్న నొకటియేయని శ్రీ యమ్. వేంకట్రామయ్య గారభిప్రాయ పడియున్నారు. J.O.R. Vol. XII, Part-IV. Ancient Political Geography by Dr. M. Venkatramayya.

# 8. " జైనవసదులు "

మహావీరుడు వైశాలీపురమందు క్రీస్తుపూర్వము 555వ సం॥త్సర ప్రాంతమున క్షత్రియకుటుంబమున జన్మించెను. ఈతడు 30 యేండ్ల వయస్సున సర్వసంగపరిత్యాగము చేసి పారసనాథులను సన్యాసులతో కలిసి రెండు సం॥ములుండెను. తరువాత నాతడు స్వతంత్ర మతమును స్థాపించి 40 యేండ్ల వరకు ధర్మోపదేశము చెసెను. క్రీస్తుపూర్వము 490 లో పరమపదము నొందెను. మహావీరునకు పూర్వము 23 గ్గురు తీర్థంకరులున్నట్లు జైన సాంప్రదాయపు చరిత్రలు చెప్పుచున్నవి. ఆంధ్రప్రదేశ్‌లోని జైన క్షేత్రాలు బోధన, వేములవాడ - అన్మకొండ - పొట్లచెరువు - ఉజ్జితి - పూదూరు - వర్ధమానపురం - కొల్లిపాక - కొనకండ్ల - తాడిపత్రి - అమరాపురం - దానవులపాడు - పాతశివారం -కర్నూలు -పెనుగొండ -, రామతీర్థం, బెజవాడలు జైన ప్రసిద్ధ క్షేత్రాలుకాగా తెనాలి, బాపట్ల, భట్టిప్రోలు, చేబ్రోలు, కొల్లూరులతో నేటి గోవాడ (దగ్గుమిల్లి) ఆలపాడు, పెదగాదెలవర్రు, చినగాదెలవర్రు, తురుమెళ్ళ, బోడపాడులతోబాటు మరెన్నో గ్రామాదులు జైన వసదులైనవి. రెండవ లేక మూడో అమ్మరాజు సేనానులైన భీమ, నరవాహనులు బెజవాడలో జైనాలయాలు వసది నిర్మించారు. వీటికి శాస్త్ర సిద్ధాంతనమయు విశారదుడైన జయసేనాచార్యులు అధివతి. తనసేనానులఅభ్యర్థనపై అమ్మరాజు పెదగాదెలవర్రును జయసేనాచార్యులకు దానం చేశాడు. తూర్పుచాళుక్య రాజులలో జైనాన్ని ఎక్కువగా ఆదరించింది రెండో అమ్మరాజు (క్రీ.శ.945-970) అయితే అమ్మరాజు శాసనాలు మాత్రం ముఖ్యంగా తాడికొండ, యలవర్రు శాసనములు అతణ్ణి పరమమహేశ్వరుడని వర్ణిస్తున్నాయి. జైనాచార్యులు జ్యోతిషం, భూతవైద్యం, వశీకరణ విద్య, విషవైద్యం మొదలైన విద్యల్లో ఆరితేరిన వారని ప్రజల్లో గాఢమయిన అభిప్రాయం ఉండేది. ప్రజల్లోని మూఢవిశ్వాసాలను అవకాశంగా తీసుకొని జైనాచార్యులు ప్రజలకు సన్నిహితులయ్యారు. వారిపట్ల ప్రజలకు భక్తి విశ్వాసాలేర్పడ్డాయి.

11వ శతాబ్దమున చెన్నపట్టణ సమీపమున శ్రీ పెరంబత్తూరులో రామానుజాచార్యులు జన్మించెను (1037). ఇతని సాంప్రదాయమును విశిష్టాద్వైతమనియెదరు.

ఈతడు వైష్ణవమత మవలంభించని జైన మతాచార్యులనేకులను రాతిగానుగులలో బెట్టి చంపబడిరి. పద్మగిరిలో దిరుగబడిన జైనులనేకులు పైరీతిగానే సంహరింపబడిరి. ఈ ఘోరప్రళయమునకు భయపడి జైనమతావలంబికులనేకులు తప్తముద్రాధారణమును గైకొని వైష్ణవులయిరి.

వైష్ణవపక్షపాతియైన విష్ణువర్ధనుడు 790 జైన దేవాలయములను నాశనము చేసి అదివరకాదేవాలయముల పోషణార్థమాదేవాలయములకు దానము చేసినమడులు, మాన్యములూడబెరకికొని వైష్ణవదేవాలయముల కైంకర్యాదుల కొసంగెను.

చోళ – చాళుక్య సంఘర్షణలలో కొల్లిపాక జైనక్షేత్రం పూర్తిగా నష్టమయింది. చోళరాజైన రాజాధిరాజు క్రీ.శ. 1045 ప్రాంతంలో కొల్లిపాకను ధ్వంసం చేసినట్లు సగర్వంగా చెప్పుకొన్నాడు.

దేవరాసయ్య అనే శివభక్తుడు పొట్లచెరువులోని 500 జైనవసదులను నిర్మూలించి, అక్కడ ఉత్తరీశ్వరుడను పేర శివుని ప్రతిష్ఠించినట్లు పండితారాధ్య చరిత్ర చెబుతున్నది. గోపూరులోని జైనవ సదులు గోపూరు బ్రహ్మయ్య అగ్రహాగ్నిలో దగ్ధమయ్యాయి. వేంగిలో జైనమత నిర్మూలనోద్యమానికి నాయకుడు అడపా రాచయ్య పశ్చిమాంధ్ర కర్ణాటక ప్రాంతాలలో కాలచురి సేనాపతులు జైన విధ్వంసానికి పూనుకొన్నారు. వీరగొగ్గిదేవ సేనానికి జైనాగమ ధూమకేతు, జైన కుఠార, జైన ఫణివైనతేయ అనే బిరుదులున్నాయి. పరిమలిగె, ఉరుకల్లు, ఆనంపూర్ మొదలైనచోట్ల శివవ్యతిరేకులను ముఖ్యంగా జైన మునులను హతమార్చారు. కందూరు చోడుల రాజధాని పానగల్లులోని జైనులు మల్లిఖార్జుని ఆగ్రహానికి బలిఅయ్యారు.

కాకతీయుల్లో కాకతి రుద్ర, గణపతిదేవ, ప్రతాపరుద్రులు జైనులను హింసించినట్లు బలమైన సాంప్రదాయం ప్రచారంలో ఉంది. జైన, శైవ సంఘర్షణను పండితారాధ్య చరిత్ర విపులముగా వర్ణిస్తున్నది. వాదనలో పరాజయం పొందిన జైనులకు శైవధర్మం స్వీకారమో లేదా నిర్మూలన తప్ప మూడోమార్గంలేదు.

చందోలు, నేలిన రెండవ గొంకరాజు అమరావతి సమీపములోని మునిగోడులోని పృధ్వీతిలక జైనవసదికి భూదానాలు చేసినట్లు శాసన సాక్ష్యం లభిస్తున్నది. మునిగోడు మరియు ప్రక్క గ్రామం నరుకుళ్ళపాడు ప్రాంత జైనులు చిత్రహింసలకు గురి అయ్యారని సూచిస్తున్నాయి.

తెనాలిలోని రామలింగేశ్వరాలయం ఒకనాటి జైన క్షేత్రమనడానికి ఆలయ ప్రాంగణంలో లభించిన వర్ధమాన విగ్రహమే నిదర్శనం. తెనాలి కైఫీయత్తు ఇచ్చట జైన, శైవ సంఘర్షణను సూచిస్తున్నది.

ఆంధ్రదేశములో జైన వసదుల వాస్తు విన్యాసంగాని, నిర్మాణ పద్ధతిగాని తెలుసుకొనుటకు ఆధారాలు కనిపించవు. బౌద్ధక్షేత్రాల మాదిరిగాక జైనక్షేత్రాలు పూర్తిగా ధ్వంసమై నశించాయి. ఈ అంశం బహుశా నాడు దేశంలో జరిగిన మత సంఘర్షణ తీవ్రస్వభావానికి నిదర్శనమేమో.

దక్షిణా పధములో చోళ, తూర్పు చాళుక్య, రాష్ట్రకూట, కళ్యాణి చాళుక్య కాకతీయులతో బాటు స్థానిక వెలనాడు - పలనాడు ప్రాంతీయనాడులు సయితం తమరాజ్యముల పెంచుకొనవలెనని స్థిరపరచుకొనవలెనని మతపోషణ చేసి, యుద్ధములు చేయుచూ, ఒక మత ప్రజను మరియొక మతనాయకులు హింసించుచు చేసిన ప్రయత్నములలో అనేక నగరములు, గ్రామములు చరిత్రకారులకు అందని రీతిని చరిత్ర ధ్వంసమాయెనని తెలియుచున్నది.

బౌద్ధమును, జైన, శైవములు అణగద్రొక్కచూడ జైనమును వైష్ణవ, శైవములు ముఖ్యముగ శైవము అణగద్రొక్కజూచెను. ఈ నేపద్యములో జరిగిన మారణహోమములు ముందు ఈనాటి యుద్ధములు సామాన్యములేనని తెలియనగును. ఈనాటి యుద్ధములు కొన్ని మాసములకే పరిమితముకాగా, సంఘ సంస్కృతిని నాశనము చేయుటకు ఆనాడు కొన్ని శతాబ్దములు పట్టెను.

# 9. జైన గ్రామ నిర్మాణముల - నైసర్గికము

## " ఆలపాడు " కైఫీయతు

పూర్వం జయినులు యీ స్థలమందు బహుదినములు నివాసము చేసినారు. గన్కు ఆస్థలం దిబ్బగా ఉన్నది. అక్కడ జంట్లమ్మ అనే గ్రామదేవత విగ్రహాలు మూడు ప్రతిమలు అదిబ్బమీద ఉన్నవి. గన్కు జంట్లమ్మపాడు అనే వాడికే వున్నది.

సదర హిద్రాశ్నిపాటికి తూపూన్ పాశ్వన్వం పావుకోశెడుదూరా నను పూర్వ జయినులు ఉండేటప్పుడు వారియొక్క ఆవుల మందలువుండే ప్రదేశమందు జయినులు ఖిలమై పోయిన తర్వాతను ఆస్థలమందు గ్రామం యేర్పడ్డది. కన్కు ఆలపాడు అనే నామం యేర్పడ్డది.

## " తురుమెళ్ళ " కైఫీయతు

ఈ గ్రామం పూర్వము కొందరు జయినులు కాపురం వుండి కొన్ని దినములకు వారు ఖిలమైపోయిరి. గన్కు ఇప్పటికిని ఆగ్రామాన్కి దక్షిణ భాగమందు దిబ్బగా వుండి వున్నది. అక్కడను ఆజైన సంబంధమయిన శిలాప్రతిమలు మొదలయినవి లేవు. ఆస్థలమందు యిదివర్కు యవరు త్రవ్వలేదు. గన్కు అక్కడ శిలాప్రతిమలు మొదలయినవి కనుపించలేదు.

## " పెదగాదెలవర్రు " కైఫీయతు

పూర్వము పెద్దింటమ్మపాడు అని చుండూరు అనే గ్రామాన్కు ఈశాన్య భాగమందు మజ్కూరి పొలిమేర లోపలనే వుండేది. ఆ స్థలమందు పూర్వం, బహుదినములు జనులు నివాసము చేసినారట. వడ్డె, రెడ్డి, కర్నాటక ప్రభుత్వములకు లోపలనే జనులు ఖిలమైపోయినారుగన్ను ఆస్థలం దిబ్బగా వుంటూ వుండెను. తదనంతరంలో చుండూరులో వున్న వారు సరహిపెద్దింటమ్మ దిబ్బకు దక్షిణం ఆగ్నేయ పార్శ్వపావుకోశెడు దూరాన దిబ్బపోయించి, యీ గ్రామం క్రింద పండెవడ్లు తీస్కుపోయి సదరహి దిబ్బమీదను గొప్ప గాదెలు

కట్టించి ధాన్యం పోస్తూ వచ్చినారు. గన్కు పెదగాదెలవర్రు అనే పేరు వచ్చినది. తదుపరి చుండూరిలోవున్న ఆసామీలు వెళ్ళి అక్కడ పాలెంకట్టినారు. గన్కు మజ్కూరి క్రిందను శివారుగా పెదగాదెలవర్రు పాలెమని అంటూ వుండేవారు.

## " చినగాదెలవర్రు " కైఫియతు

ఈ గ్రామమునకు పూర్వము నుంచి చినగాదెలవర్రు అనే పేరు వచ్చినవైనం యీ స్థలం మండూరు అనే గ్రామాన్కు వాయువ్య మూలముగా వుండును గన్కును అక్కడ కొన్ని దినములు జైనులు నివాసము చేశినారు. వడ్డె, రెడ్డి కర్నాటక ప్రభుత్వములకు లోపలెనే జయినులు ఖిలమయి పోయినారు. గన్కు ఆప్రదేశం మెర్కగావుండె గన్కును మండూరిలో పండిన పంట తీసుకొని పోయి, సదరహి దిబ్బమీద చిన్నగాదెలు కట్టించి, ధాన్యం పోస్తూ వచ్చినారు గన్కు చినగాదెలవర్రు అయినది.

## " బోడపాడు " కైఫియతు

పూర్వము క్రీస్తు శకం 1104 ఒకజయినుడు మాగవశాత్తుగా యీ గ్రామంలోనికి వచ్చి యిక్కడ నివాసం చేసి, యుండవలయునని విచారించి, తాను ఒక గృహం కట్టుకొని, యింకా అనేకమంది తన మతస్తులను యేమి, యితరములయిన వారినేమి గ్రామంలో వుంచి, ఆగ్రామానికి అధికారము చేస్తూ వుండి వున్నాడుగన్కు, ఆజయినుడి పేరు బొడులు అనె నామంగల వాడయినందున యీతనివల్ల గ్రామం బస్తీ అయిన విధంవల్లను యీగ్రామాన్కు బోడలపాడు అనె నామాంకితముగా ప్రశిద్ధి కల్గివున్నది.

జయినులు మన్ను దిబ్బలుపోసి, ఆ దిబ్బలమీదను గృహాలు కట్టి, కాపురాలు చేశేటివారు. వారు కాపురాలు చేశేటి గ్రామమధ్య మందునను సూర్యనారాయణ అనే దేవుండు గ్రామానకు పశ్చిమ భాగమందున జట్లంమ్మా అనే శక్తి గ్రామానకు పూర్వ భాగమందునను దేశమ్మ అనే శక్తియీ -దేవుళ్ళను కొల్చేది. పూర్వపు దగ్గుమిల్లిలో యింకనూ జమ్మి వృక్షము క్రింద దేశమ్మ శక్తి దేవత వుండి అప్పుడప్పుడూ పూజాదికము లందుకొనుచుండెను.

దగ్గుపల్లి - గోవాడలు రెండునూ ఏగ్రామమునకు - ఆగ్రామము చూచుకొనిన స్థలములో నైరుతీదిశన గ్రామముల ఏర్పాటు జరిగినది. నైరుతిని బరువుండుట సుఖప్రదము. దగ్గుపల్లికి వాయవ్యము పల్లము. కాగా గోవాడకు వాయవ్యము మెరక. ఇదియే గ్రామాభివృద్ధుల మధ్య వాస్తుతేడా.

## 10. దగ్గుమిల్లి - బస్తీ

తురుమెళ్ళ, పెదగాదెలవర్రు, చినగాదెలవర్రు, బోడపాడు వగైరా కైఫియత్తులను పరిశీలించి - తదుపరి గోవాడ కైఫియత్తును పరిశీలించిన "జైనులు మొదలైనవారి వల్ల ఆ పట్నం బస్తీగా వుండేటప్పుడు" అనేక గ్రామాల్కు దగ్గుమిల్లి వ్యాపారవస్తు లావాదేవీల కూడలిగా యుండి – యున్నప్పుడే బస్తీపదము వాడెదరు. మరియు చందవోలు రాజ్యమునకు దగ్గరలోని అతిపెద్ద గ్రామ కూడలి దగ్గుమిల్లి అనుటలో సందేహము లేదాయె. చందవోలుకు దగ్గరలో చెరుకుపల్లి, ఇంటూరు వగైరా గ్రామములున్నను శైవుమూక దగ్గుమిల్లిపై బడుట పై ఆలోచనకు దారితీయుచున్నది.

## 11.తుంగభద్ర - 2 :

ఈ నది యీ కాలమున నామమాత్రావశిష్టమైయున్నది. గుంటూరు మండలములోని ప్రాచీనాంధ్ర శాసనములందు పేర్కొనబడినది. కృష్ణకు దక్షిణ తీరమున సీతానగర కొండల ప్రాంతమునుండి ప్రవహించి బాపట్ల తాలూకాలో సముద్రమునుగలియు నొక యేరు. ఇది కృష్ణాడెల్టా నిర్మాణము నందు కొంత దూరము పంట కాలువగాను, మురుగు కాల్వగాను నుపయోగింపబడినది.

## 12. వెలనాడు :

వెలనాటి గొంకరాజు శాసనములో ఆంధ్రదేశము పంచశత లక్ష గ్రామ పరిమితమగు దేశమని వక్కాణింపబడినది.

" ధనదాఖ్యపురం రమ్యం కృష్ణవేణ్యా సమీపతః
తుంగభద్రా తరంగిణ్యాం ప్రాగ్దిశం వెలనాడితి
విఖ్యాతం జన సంపూర్ణం మల్లవర్మా తధాకరోత్

స్వనామ్నా శివలింగేశం ప్రతిష్ఠాప్య వ్యరాజత
తద్వంశజాతో గొంకేశ శరణ్యస్స్వ వ్యభూభృతాం
మదా స్వృగస్య విఖ్యాతా సన్నద్ధర జయన్నృపాల్
పంచాశత్ లక్షయుక్త మంధ్రదేశ మపాలయన్."

తుంగభద్రా నదికి పూర్వ దిక్కున వెలనా డుండెను. దానిని బాలించిన మొదటి (?) గొంకరాజు 50,00,000 గ్రామ పరిమితి గల ఆంధ్రదేశమును బాలించెనని పై శాసనమువల్ల ద్యోతకమగుచున్నది.

వెలనాటి మండలేశ్వరులకు రేపల్లె తాలూకాలోని చందవోలు రాజధాని. దీనికే సనదవ్రోలు, ధనదుపురము అను నామాంతరములు గలవు. వెలనాటి గొంకరాజు ద్రాక్షారామ శాసనములో నతడు వెలనాటిలో ధనదేశ్వరనగరమునకు (అలకావురి) సాటివచ్చు సనదవ్రోలు పట్టణము నేలుచుండెనని చెప్పబడినది.

స్వస్తిశ్రీ వెలనాండు నామవిషయే తస్మిన్మహద్భూతలే
ప్రఖ్యాతో ధనదేశ్వరస్య పురసద్వృత్తోన్నతో శ్రీ .......
................ సహకార వల్లభ ఇతిశ్రీ గొంకభూపాలక
స్తస్యాజ్ఞా పరిపాలితా సనదవ్రోలు నామాతిరమ్యాపురీ ॥

మంచనకవి కూయూరబాహు చరిత్రములో గొంకరాజునకు ధనదుపురమే రాజధానియని చెప్పుచు నాపట్టణము నీక్రిందిపద్యములో వర్ణించి యున్నాడు.

సీ. పుష్పక నివహంబు భూమిపై నిలిచిన
యట్లందమైన దేవాలయముల
రూప్యాచలము బహురూపంబుల నటించు
రమణశోభిల్లు సౌధములపెల్లు
అలకాధిపతి నిధులన్నియు వెలివీట
విడిసిన క్రియ బణ్యవీథికలును
ధాతమేదిని మిన్నుదఱగివైచిన మాడ్కి
గనుపట్టు బహుతటాకముల సొంపు

గీ. నుపవనంబులు సరసులు నొప్పుచేయు
చెఱకుదోటలు బ్రాసంగుచేలు మెరయ
నఖిల విభవంబులకు నెలపగుచు వెలయు
ధనదుపురమున కెనయన ధనదుపురము.

గీ. మంటికడవ నులకమంచంబు పూరిల్లు
నూలిచీర రత్నకీలితంబు
గానిపైడి తొడవు గలుగుటెఱుంగరు
ధనదుపురములోని జనములెల్ల.

## 13. "చందోలు" రాజరికము

పూర్వ కృతయుగమందు సంవ్వాదపురమని, త్రేతాయుగమందు సనకసనందన సనత్కుమారపురమనిన్ని, ద్వాపరయుగమందు ధనదుప్రోలు అనిన్ని, కలియుగమందు చందవోలు అనిన్ని, నాల్గుయుగములో నాల్గు నామములు కలిగి యున్నదని చంద్దవోలు కైఫియతు తెలుపుచున్నది.

భట్టిప్రోలుకు నైఋుతి దిశలో 15 మైళ్ళ దూరంలోను గోవాడకు నైఋుతీదిశలో 5 మైళ్ళ దూరంలోను ఉన్నది. ధనదపురం - ధనదప్రోలు - సనదుప్రోలు - చందోలు.

విజయవాడ వద్దగల కృష్ణ నుండి దిగువ హంసలదీవి వరకు గల కృష్ణ కిరువైపుల గల గుంటూరు, కృష్ణా జిల్లాల నడుమ ప్రదేశము తుంగభద్ర పుల్లేరుల మధ్య ప్రదేశము ఒకనాటి దివ్యసీమ - దివిసీమ - మునులసీమ. అందు తుంగభద్రకు తూర్పున నున్నది. వెలనాడు దాని రాజధాని చందవోలు.




వెలనాటి రాజులు 5వ శతాబ్దము నుండి పృధ్వీశ్వర వరకు 18 తరములు పాలించిరని తెలియుచున్నది.

మల్లవర్మ :-త్రిలోచనపల్లవుని సామంతుడుగ దుర్జయవంశములోని మల్లవర్మ వెలనాటిని దాదాపు 5వ శతాబ్దిలో పాలించెను. ఈ వంశీకులు వరుసగానే యచట పాలించిరి. త్రిలోచన పల్లవుని కావేరి నదికి ఆనకట్టవేయించిన కరికాలచోళుడు

జయించినటుల గలదు. కనుక కరికాలుని క్రింద మల్లవర్మ సామంతుడుగ పనిచేసెను.

మల్లవర్మ II లేక III క్రీ.శ. 888-945 మధ్య పాలించిన తూర్పు చాళుక్య రెండవ భీమరాజు సామంతుడు.

కుడ్యవర్మ - II క్రీ.శ. 1011-22 మధ్య నేలిన విమలాదిత్య చక్రవర్తి సామంతుడు.

నన్నిరాజు :- రాజరాజనరేంద్రుని సామంతుడు.

వేదురుడు :- వీరచోడుని సామంతుడుగనుండిరి.

వెలనాటి గొంకరాజు-I కుళోత్తంగ చక్రవర్తి సామంతుడు - ఈతడు చాళుక్యరాజ్యములోని 1300 గ్రామములకు ప్రభువుగ ఉండెను. 1076 - 1106 మధ్య పాలనాకాలము.

వెలనాటి కుళోత్తంగ చోడరాజు-I క్రీ.శ. 1108 - 1136 మధ్య వెలనాడు మున్నగు 16000 గ్రామములులు తూర్పుచాళుక్య చక్రవర్తి పక్షమున పాలించెను. కుళోత్తంగ చక్రవర్తి అభిమాన పుత్రుడు, చాళుక్య రాజ్యభవన మూలస్థంభ బిరుదు పొందినవాడు. కానీ 1126 - 38 మధ్య పశ్చిమచాళుక్య విక్రమాదిత్యా-VI ; సోమేశ్వర-III లకు లోబడి పాలించెను.

వెలనాటి గొంకరాజు-II వెలనాటి రాజేంద్రచోడుని కుమారుడగు గొంకరాజు-II క్రీ.శ.1130 లో వెలనాటి రాజాయెను. ఈతని కాలమున సామంతులు స్వతంత్రులగుటకు బ్రయత్నింపగా, కుమారుడగు 2వ రాజేంద్రచోడుడు, మేనల్లుడగు కోటచోడరాజులను పంపి - మూర్ఘవాడి పొలకేశి, కొలనిభీముని, పిఠాపురం విజయాదిత్యుని, రాజమహేంద్రవరమున విష్ణువర్ధనుని లోబరుచుకొనెను. 1133లో పశ్చిమ చాళుక్య రాజసైన్యములను గోదావరి యుద్ధమున ఓడించి, పారద్రోలెను. కాకతి ప్రోలరాజు వెలనాటిపై దండెత్తిరాగా యాతని

వీరరాజేంద్ర, కోటచోడయ రాజులు కలిసి మడియించిరి. కొలనురాజుల జయించెను.

వెలనాటి రెండవ రాజేంద్రచోడరాజు - 1160 నుండి ఈయన స్వతంత్రముగా పాలించెను. 1180 ప్రాంతమున కాలచుర్యులు, కాకతీయరాజులు, వేంగిచాళుక్యులు, పాకనాటి చోడులు కలిసి యీయనను వధించి, చందోలును దగ్ధమొనర్చిరట.

వెలనాటిగొంకరాజు-III ఈయన 1181-1186 మధ్య వెలనాడు శత్రువులు హరించగా పిఠాపురమును నితడు పాలించినట్లు కొందరు చరిత్రజ్ఞుల విశ్వాసము.

వెలనాటి వృద్ధేశ్వర (1186-1211). ఈయన 3వ గొంకరాజునకు జయమహాదేవివల్ల జనించెను. ఈయన తండ్రితో పిఠాపురమునకు పోయి రాజ్యము స్థాపించుకొని యచట బలపడిన పిమ్మట దండెత్తి 1203 నాటికి వెలనాటి రాజధాని అగు చందోలుని తిరిగి స్వాధీనమొనర్చుకొనెను. 1211లో గణపతి దేవచక్రవర్తి దండయాత్రకు రాగా వెనుకకు పారద్రోలెను. ఈతడు యిమ్మడి రాజాధిరాజ చోళునకు సామంతుడై అతనికి సాయముగా నెల్లూరు చోడతిక్కనతో యుద్ధమొనర్చి, అందులో హతుడయ్యెను. గణపతిదేవుడు 1212 - 14 మధ్య వెలనాడాక్రమించెను.

కొండపడమటి బుద్ధరాజు :- బుద్ధవర్మవంశములోని బుద్ధరాజు చెల్లెలు అయిన అక్కమ్మను వెలనాటి ప్రభువైన రాజేంద్రచోడునకిచ్చి వివాహము చేయబడెను. ఈయన కొండవీటికి పశ్చిమ సీమను నాదెండ్ల రాజధానిగ పాలించెను. వీరి గురువైన బిజ్జయుండనే బౌద్ధాచార్యులు బుద్ధాం గ్రామనివాసి.

## 14. సందిగ్ధత

శ్రీ తుమ్మల వెంకటరత్నము గారి రచన " దగ్గుమల్లి నుంచి గోవాడ దాకా " యందు చారిత్రక సంవత్సరములు పాఠకులను అయోమయంలోనికి నెట్టుచున్నవి.

I. (1) దగ్గుమల్లి - గోవాడ పేజీ 6. ఆ రాయలు <u>క్రీ॥శ॥ 1655</u> క్రోధి సంవత్సర పుష్యపూర్ణిమ ఆదివారం సోమోపరాగ కాలమున చిలుకమఱ్ఱి వల్లభాచార్య అయ్యవారికి అగ్రహారంగా గోవాడను దగ్గుమల్లి శివారు సమేతంగా దానంజేసి తామ్రశాసనం వ్రాయించి యిచ్చాడు.

(2) వేణుగోపాలస్వామి దేవస్థానము - పేజీ 7. 16వ శతాబ్దంలో విజయనగర సామ్రాజ్యాన్ని సదా శివదేవరాయలు పాలిస్తూవుండేవాడు. ఆ ప్రభువు <u>1644 క్రోధినామ సంవత్సర</u> పుష్యపూర్ణిమ ఆదివారం సోమోపరాగపర్వ సందర్భాన - శ్రీ మద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యులు, ఉభయవేదాంత ప్రవర్తకులు, ఆశ్వలాయన సూత్రీకులు, ఋుక్‌శాఖాధ్యయన శీలురు, కాశ్యపసగోత్ర పారంపర్యులు అయిన చిలుకమఱ్ఱి వల్లభాచార్య అయ్యవార్లకు సర్వాగ్రహారాలు శివారు సమేతంగా యీ గోవాడ గ్రామమును అంకెలకూరపాడు, అనమర్లపూడి గ్రామాలతోసహా యీ మూడు గ్రామాలు సహిరణ్యోదక దానధారాపూర్వకంగా దానం యిచ్చి, తన ధర్మములా చంద్రార్క స్థాయిగా నుండవలసినందుకు, తామ్రశాసనాలు రాయించి యిప్పించినారు.

(3) వేణుగోపాలస్వామి అర్చకస్వాములు - పేజీ - 9. దానపరాయణుడైన సదాశివాదేవరాయలు <u>1544 క్రోధినామ సంవత్సర</u> పుష్యపూర్ణిమ ఆదివారం సోమోపరాగపర్వ సందర్భమున శ్రీ మద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యులు, ఉభయ వేదాంత ప్రవర్తకులు అశ్వలాయన సూత్రీకులు ఋుక్‌శాఖాధ్యయన శీలురు కాశ్యపస గోత్రపారంపర్యులు అయిన చిలుకమఱ్ఱి వల్లభాచార్య అయ్యవారికి యీ గోవాడ గ్రామాన్ని సహిరణ్యోదక ధారా పూర్వకంగా దానం చేసి తామ్రశాసనం రాయించియిచ్చారు.

(4) గోవాడ కైఫియత్తు - పేజీ - 92 : సదా శివదేవ మహారాయలుగారు ప్రభుత్వమునకు వచ్చి శా <u>1466 (క్రీ॥శ॥ 1544) అగే నేటి క్రోధినామ సంవత్సర</u> పుష్యశుద్ధ 15 ఆదివారం నాడు శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య ఉభయ వేదాంత ప్రవర్తకులైన ఆశ్వలాయన సూత్రీకులైన ఋుక్ శాఖాధ్యయనులున్ను కాశ్యపసగోత్ర పారంపర్యులున్ను అయిన చిలుకమఱ్ఱి వల్లభాచార్య అయ్యవార్ల గారికి

సర్వాగ్రహారములుగా ఈ గోవాద అనేగ్రామము సహిరణ్యోదక దాన ధారాపూర్వకంగాను దానం ఇచ్చి తమ ధర్మములు ఆచంద్రార్క స్థాయిగ జరగవలసినందుకు తామ్ర శాసనములు వ్రాయించి యిప్పించినారు.

పైవానినిబట్టి సదాశివరాయుల దాన సంవత్సరము (క్రోధినామసంవత్సరము ఎప్పుడు అనునది సందిగ్ధతకు నెలవగుచున్నది)

**II.** (1) దగ్గుమిల్లి - గోవాడ - పేజీ - 6 : వల్లభాచార్యులు తనకు దత్తమైన యీ అగ్రహారానికి శ్రీభాష్యపురమని నామాంతర మేర్పరచి దక్షిణాది నుండి గోపాలస్వామి శిలావిగ్రహం తెప్పించి రుక్మిణీ సత్యభామా సహితంగా <u>క్రీ॥శ॥ 1649 సౌమ్య</u> సం॥ శ్రావణశుద్ధ దశమీ శనివారంనాడు ప్రతిష్ఠ జరిపి దేవాలయం కట్టించాడు.

(2) శ్రీ వేణుగోపాలస్వామి-దేవస్థానము– పేజీ - 7 : ఆచార్యుల వారు వచ్చి కుటుంబసమేతంగా నివసిస్తూ, యీ గ్రామానికి శ్రీ భాష్యపురమనే ప్రతినామం ఏర్పరచి, ఈ గ్రామం వలస వచ్చు ఫలసాయం అనుభవిస్తూ - దక్షిణాదిని కాంచీ ప్రాంతంలోని చోళంగివరం అనే గ్రామం నుంచి సంతాన గోపాలం అనే శిలావిగ్రహాన్ని తెప్పించి, రుక్మిణీ సత్యభామాసమేతంగా ప్రతిష్ఠచేసే నిమిత్తం ఆలయం కట్టించి <u>1549 సౌమ్య</u> నామ సంవత్సర శ్రావణశుద్ధ దశమీ శనివారం ప్రతిష్ఠ చేయించి.

(3) వేణుగోపాలస్వామి అర్చకస్వాములు - పేజీ - 9 : వల్లభాచార్యులవారు వారి కుమారుడు రామానుజాచార్యుదు, వారి కుమాళ్లు వల్లభాచార్యులు, వెంకటాచార్యులు - <u>యీ మూడు తరాలవారు</u> యీ గ్రామంవల్ల వచ్చు ఫలసాయం అనుభవించుచు <u>1549లో</u> శ్రీ మద్వేణుగోపాలస్వామి వారి ప్రతిష్ఠ గావించారు.

(4) గోవాడ <u>కైఫియత్తు</u> - పేజీ - 92 : ఆయన మజుకూరిలోనికి వచ్చి సకుటుంబ సమేతంగా నివసించి యీ గ్రామమునకు శ్రీ భాష్యపురం అనే ప్రతినామము నేర్పరచి ఈ గ్రామము వలన వచ్చు ఫలసాయము ననుభవించుచు

కాంచీ దేశములో చోళంగివరం అనే గ్రామంలో నుంచి సంతాన గోపాలం అనే శిలా విగ్రహాన్ని తెప్పించి రుక్మిణీ సత్యభామా సహితంగా ప్రతిష్ఠచేసే నిమిత్తం ఆలయము కట్టించి 1471 శాలివాహనం శకమందు (క్రీ॥శ॥ 1549) సౌమ్యనామ సంవత్సర శ్రావణ శుద్ధ 10 స్థిరవారమున ప్రతిష్ఠచేయించి.

పైవానినిబట్టి శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయ ప్రతిష్ఠ 1 – 2, 3, 4 ల వ్యత్యాసమును చూడనగును.

III. (1) శ్రీ వేణుగోపాలస్వామి దేవస్థానము - పేజీ - 8 : సదరు వల్లభాచార్యులున్నూ ఆయన కుమారుడు రామానుజాచార్యులున్నూ, 1648 వరకు నిరాటంకంగా అనుభవించారు.

(2) కైఫీయత్తు –పేజీ–92 : సదరహో వల్లభాచార్యులున్ను ఆయన కుమారుడు రామానుజాచార్యులు గారున్ను శాలివాహనం 1540 అగునేటి సంవత్సరం వరకు నిరాటంకంగా అనుభవించినారు.

పై అన్నింటి దృష్ట్యా చారిత్రక సంవత్సరముల–సందిగ్ధత పాఠకులను అయోమయంలోనికి నెట్టుచున్నది.

## 15. దగ్గుమిల్లి - మంచన

శ్రీ పావులూరి వెంకయ్య చౌదరి జిల్లా పరిషత్ ఉన్నతపాఠశాల గోవాడ రజతోత్సవ సంచిక 1976 ( శ్రీ తుమ్మల వెంకటరత్నం గారిచే వ్రాయబడిన దగ్గుమిల్లి – గోవాడ వ్యాసము నుండి

"13 శతాబ్ద్యుత్తరార్థంలో సనదవోలులో వున్న మంచన కవీశ్వరుడీ దగ్గుమిల్లి కల్లోలాన్ని భంగ్యంతరంగా రుజువు పరిచాడు తన కేయూర బాహుచరిత్రలో, మాణిక్యసేనుడనే రాజు జైనులకు వసతులు కల్పించాడనీ, ఏనుగు చెవిలో తొండ దూరిందనీ, ఆ యేనుగు గగ్గోలు చెంది చెలరేగి జైనుల వసతుల నన్నింటినీ నేలమట్టం చేసిందనీ కథ కల్పించాడు. ఆ కథలోని మాణిక్యసేనుడే గొంక భూపతి అనీ, ఏనుగే వీరశైవులమూక అనీ మనం గ్రహించవచ్చు."

**1999** లో స్వాతంత్ర్య స్వర్ణోత్సవ ఆహ్వాన సంఘము, గోవాడ వారి "భారత స్వాతంత్ర్య సమరంలో గోవాడ " పుస్తకము నందలి దగ్గుమిల్లి - గోవాడ వ్యాసమున్నూ -

**2001** జూన్ నందు అచ్చిడిన శ్రీ పావులూరి వెంకయ్య చౌదరి జిల్లా పరిషత్ ఉన్నతపాఠశాల - గోవాడ స్వర్ణోత్సవ సంచిక " దగ్గమల్లి - గోవాడ " వ్యాసమున్నూ -

**2001** ఆగష్టు నందు అచ్చిడిన "గోవాడ గ్రామ పావులూరి (కమ్మ) వారి వంశవృక్షములు" నందలి దగ్గుమిల్లి నుండి గోవాడ " వ్యాసమున్నూ -

**2003** మార్చి నందు అచ్చిడిన "దగ్గుమల్లి నుంచి గోవాడ దాక " లో దగ్గుమిల్లి - గోవాడ వ్యాసముతోసహా అన్నియునూ

శ్రీ తుమ్మల వెంకటరత్నం గారిచే వ్రాయబడినది.

పై వానినిబట్టి మంచెన కవీశ్వరుడు దగ్గుమిల్లి కల్లోలమును భంగ్యంతరంగానైన రుజువుపరిచాడు తన కేయూర బాహు చరిత్రలో అనుటకు వీలుకలుగుటలేదు.

గోవాడ కైఫీయత్తు నందెచ్చటను దగ్గుమిల్లిపై - వీరశైవులమూక దాడి చేసినదని వ్రాసి యుండలేదు. మంచన కవీశ్వరుడు తనకేయూరబాహు చరిత్రలో ప్రచ్ఛన్నముగా పేర్కొననూ లేదు. భంగ్యంతరంగా రుజువు పరిచాడు అనుకొనుటకు పూర్తి స్పష్టత లేదు.

మంచన ఏ ప్రాంతంవాడో తెలియదు. కానీ కందుకూరి వీరేశలింగం గారు - ఇతడు రాజమహేంద్రపుర నివాసుడని వ్రాశారు. ఇతనిచే వ్రాయబడినది కేయూరబాహు చరిత్ర. ఈ కృతిని తన స్నేహితుడు, చందోలు నివాసి అయిన నండూరి గుండన మంత్రికి అంకితమిచ్చెను.

నండూరి గుండన తాత నండూరి కేతన. వెలనాటి చోడులలో ఆఖరివాడైన పృధ్వీశ్వరుని వద్ద మంత్రిగా యుండెను.

2వ రాజేంద్ర చోడరాజును 1180 ప్రాంతమున కాలచుర్యులు, కాకతీయరాజులు, వేంగిచాళుక్యులు, పాకనాటి చోడులు కలసి వధించి చందోలును

దగ్ధమొనర్చ ఆయన కుమారుడు వెలనాటి గొంకరాజు - III పిఠాపురమునకు వెళ్ళెను. IIIవ గొంకనికి జయ మహాదేవి వల్ల జన్మించిన పృద్వీశ్వర - తండ్రితో పిఠాపురమున నుండి అచట బలపడిన పిమ్మట 1203 నాటికి వెలనాటి రాజధాని యగు చందోలును తిరిగి ఆక్రమించెను. ఇతడు ఇమ్మడి రాజాధిరాజచోళునకు సామంతుడై అతనికి సాయముగా నెల్లూరు చోడ తిక్కనతో యుద్ధమొనర్చి అందు హతుడయ్యెను.

మొత్తము 767 గద్య పద్యాలు గల కేయూరబాహు చరిత్రలో 468 గద్య పద్యములు పిట్టకథలతో నిండెనట. ఈకథలో గుండన మంత్రికి అతని మేనల్లుడు సోమదత్తు చెప్పినట్టు, అంతఃపుర దాసీలైన సుమతి, మకరందిక, సుకుమారికలు తమలో తాము చెప్పుకొన్నట్టు, రాజుకు - విదూషకుడు అయిన బాదనారాయణుడు చెప్పినట్లును వుండును. అందు మకరందిక చెప్పిన కథలు:
1. తొండలు పోరితే జనులకు బాధ పుట్టిన కథ 97-107
2. బుద్ధిమాలిన కపి భూమిపాలుని చంపిన కథ 289-300
3. వివేకి అయిన చోరుడు శత్రువైన విప్రుని కాచిన కథ 302-338

ఏనుగు వీరశైవుల మూక అయిన ఏనుగు చెవిలో దూరిన తొండ మల్లిఖార్జున పండితారాధ్యులు కావలె. ఫలితము ఏనుగు - తొండ రెండింటి మరణము జరుగవలె. సందర్భాసందర్భములకు అందుటలేదు.

## 16. దగ్గుమిల్లి పై - శైవుల దాడి

శ్రీ తుమ్మల వెంకటరత్నం గారిచే రచింపబడిన వ్యాసము దగ్గుమిల్లి - గోవాడ రజతోత్సవ సంచిక 1976 నుండి

పండితారాధ్యులు సనదవోలులో చోడభూపతి కొలువుకూటంలో, బౌద్ధ పండితుల్ని ఓడించగా ఆయన శిష్యులైన వీరశైవులువెలనాటి పశ్చిమోత్తర ప్రాంతాలలో వీరవిహారం సాగిస్తూ బౌద్ధాచార్యుని పొట్ట చీల్చి చంపివేశారు. చోడభూపతి వారిని శిక్షింపబూనగా ఆరాధ్యుల వారూ ఆయన శిష్యులూ రాష్ట్రములో తిరుగుబాట్లు జరిపారు. ఆరాధ్యులవారి గారడీ విద్యల కాకర్షితులైనవారు

వీరశైవులకు తోడ్పడ్డారు. ఆయలజడిలో వెలనాడు అల్లకల్లోలమయింది. విద్రోహకచర్యలు రాజధానిలోగూడ చెలరేగి దాని పరిసరాల్లో వ్యాపించినవి. దగ్గుమిల్లి సనదవోలుకు సమీపంలోనిది. వీరశైవులు మూకగా దగ్గుపల్లి మీదపడ్డారు. దీపారాధనకు ఆవునేయి కడవలతో తెమ్మన్నారు. జైనులు నిరాకరించారు. అసలే కసిపూని యున్న శైవు లాజైనుల వసతులను కొల్లగొట్టి వారి ఆవులను బడితలతో చావమోదారు. చావగా మిగిలిన వాటిని తరుమ గొట్టారు. అవన్నీ జైనుల ఆవులే కాదు; ఇతరులవి కూడ వున్నవి. శైవుల ఆగడ మొక్క నాటితో ఆగినది కాదు. పౌరులు భయభ్రాంతులై తమ ఆలమందలను దూరంగా ఉత్తరానవున్న బీళ్ళలో కట్టివేసి కాపాడుకొన్నారు. జైనులు వసతులు విడిచి ఆలుబిడ్డలతో అలమటిస్తూ కాందిశీకులై పోయారు. మిగిలిన పౌరులు బీళ్ళలోనే గోవులకు చావళ్ళు వేసుకున్నారు. వారిలో కొందరు క్రమంగా అక్కడే నివసింపజొచ్చారు. అదొక చిన్న ఊరైనది. గోవుల నివాసంగా ఏర్పడిన ఊరు గోవాడ అయింది."

పైవారిచేతనే వ్రాయబడిన బాలకోటేశ్వర స్వామి దేవస్థానము వ్యాసము స్వర్ణోత్సవ సంచిక **2001** జూన్ నుండి

"పండితారాధ్యులు సనదవోలులో చోడభూపతి కొలువు కూటంలో బౌద్ధపండితుణ్ణి ఓడించగా, ఆయన శిష్యులైన వీరశైవులు ఉత్సాహంతో వెలనాటి పశ్చిమోత్తర ప్రాంతాలలో వీరవిహారం సాగిస్తూ బుద్ధారామంలోని బౌద్ధగురువైన బౌద్ధపదపరాచార్యుని పొట్టచీల్చి చంపివేశారు. చోడభూపతి విచారించగా పండితారాధ్యుడు తానే రేమయ్య దేవయ్యల చేత హత్య చేయించినట్లు ఒప్పుకున్నాడు. అంతట చోడభూపతి వారికి శిక్షింపదలచి "బ్రాహ్మణో నహంతవ్య:" అని పండితారాధ్యుని కళ్లలో జీడిపాలు పోయించాడు. ఆరాధ్యుడంధుడైనాడు. రేమయ్య దేవయ్యలకు సాధారణ శిక్ష విధించారు. వీరశైవుల మూక రాష్ట్రంలో తిరుగుబాట్లు జరిపారు. ఆ అలజడిలో వెలనాడు అల్లకల్లోలమయింది. వారి విద్రోహచర్యలు రాజధాని పరిసరాల్లో వ్యాపించినవి. దగ్గుమిల్లి సనదువోలికి సమీపంలోనిదే. వీరశైవులు మూకగా దగ్గుమల్లి మీద

పద్దారు. అది జైనుల వసతి. వారిని దీపారాధనకు కడివెడు నెయ్యి తెమ్మన్నారు. జైనులు నిరాకరించారు. అసలే కసిపూని వున్న శైవులు, జైనుల వసతులను కొల్లగొట్టి పశువులను పారద్రోలారు. ప్రజలను హింసించారు. తిరిగివచ్చిన పశువులను తరిమివేశారు. హింసలనుభవిస్తూ వూరు వదలని జనులను చంపివేశారు. భయపడినవారు ముందే వూరు విడిచి పారిపోయారు. ఆ అలజడిలో జైనులే నష్టపడలేదు. ఇతరులెందరో నష్టకష్టాల పాలైనారు. శైవుల ఆగడ మొక్కనాటితో ఆగలేదు. పౌరులు భయభ్రాంతులై తమ ఆలమందలను దగ్గుమిల్లికి వుత్తరానవున్న బీళ్ళలో కట్టివేసి కాపాడుకొన్నారు. మిగిలియున్న జైనులు వసతులు విడిచి ఆలు బిడ్డలతో అలమటిస్తూ కాందిశీకులైపోయారు. పౌరులు బీళ్ళలోనే ఆలమందలకు చావళ్లు వేసుకుని తమకు కుటీరములు నిర్మించుకొని అక్కడే నివసింపసాగారు. అదొక వూరైంది. గోవుల నివాసంగా యేర్పడిన వూరు గోవాడ అయింది."

పై వారిచేతనే వ్రాయబడిన " దగ్గుమిల్లి నుంచి గోవాడ దాకా " పుస్తకము నుండి బాలకోటేశ్వర స్వామి దేవస్థానము వ్యాసము గూడా ఇదే విషయమును వ్రాసి ఉన్నారు.

గోవాడ కైఫియత్తు యందెచ్చటనూ దగ్గుమిల్లిపై - వీరశైవులమూక దాడిచేసినదని వ్రాయలేదు. షుమారు **200** సంవత్సరములనాడు చరిత్రలో వ్రాయని విషయమును - శ్రీ తుమ్మల వెంకటరత్నము గారు బయటకు తెచ్చిరి మొదటగా **1976** నందు వారు వ్రాసిన వ్యాసములో. వీరశైవులు - దగ్గుమిల్లి వచ్చి "దీపారాధనకు ఆవునెయ్యి కడవలతో తెమ్మన్నారు. జైనులు నిరాకరించారు. అసలే కసిపూని వున్న శైవులాజైనుల వసతులను కొల్లగొట్టి వారి ఆవులను బడితలతో చావమోదారు. చావగా మిగిలిన వాటిని తరమకొట్టారు." అని వ్రాసిరి. శైవులు వచ్చినది ఆవు నేయి కొరకైన - జైనుల వసతులను కొల్లగొట్టినపుడే వారికి కావలసిన నేయి లభించును. ఇచ్చట మరియొక సూక్ష్మ ధర్మము దీపారాధనకు ఆవునెయ్యి కావలెనని శైవులు అడుగుట. వారికి దీపారాధన ఆవునేతితో చేసిన పుణ్యపురుషార్థములని తెలిసి యడిగిరనిన అట్టి నెయ్యి

బీజస్థానమైన ఆవులను వారు చావబాదవలసిన అవసరమేమున్నది. కావలెననిన ఆవులనే తరలించుకొని తీసుకొని పోవచ్చును గదా. వాటిని చంపునవసరమేమున్నది. పై స్వర్ణోత్సవ సంచిత వ్యాసములో " దీపారాధనకు కడివెడు నెయ్యి తెమ్మన్నారు " అని వ్రాసినారు. కడివెడు నెయ్యి కొరకు ఆవులను చంపుట మరియు " హింసలను భరిస్తూ ఊరువదలని జనులను చంపివేశారు " ఇంతటి విషయమును గ్రామ చరిత్ర అనదగు కైఫియత్తులోనికి ఎందుకు రాలేదనునది ప్రశ్నార్ధకమే. వెంకటరత్నం గారు ఏ ఆధారపూర్వకంగా వ్రాసితిరనునది ప్రశ్నార్ధకమే.

ఎచ్చటనుండియో వచ్చిన వీరశైవులమూక ఉద్దేశ్యము దగ్గుమిల్లి ధ్వంసమే అయినా గ్రామ హద్దులలోనే యున్న గోవులబీడులలో తలదాచుకొన్న వారిని వదలవలసిన పనిలేదు. పొలిమేర దాటించెదరు గదా. కనుక శైవమూక దాడి ఉద్దేశ్యమును - అందుకు దగ్గుమిల్లి స్థానము ప్రతిఘటించుటను అధారపూర్వకముగా ప్రతిభింబింపచేయుటలో ఏదో - మసక యున్నదనవచ్చును. చరిత్ర కనుగొనుటలో అవరోహణము మిక్కిలి కష్టమైన చర్య.

## 17. దగ్గుమిల్లి - దుగ్గన

దుగ్గన విషయమునకు ముందు దుగ్గనచే వ్రాయబడిన నాచికేతోపాఖ్యానములోని కథానాయకుడు మాధవవర్మను గూర్చి కొంత తెలుసుకొనుట అవసరము. ఆంధ్రుల చరిత్రము మధ్యమ యుగము గ్రంథకర్త చిలుకూరి వీరభద్రరావు గారు పేజీ నెం.141.

"12వ శతాబ్దమునందు వేంగీదేశాధీశ్వరునకు సామంతుఁడుగ నుండిన మహామండలేశ్వర పల్లకేతభూపాలుడు బెజవాడ మల్లేశ్వర స్వామి వారి యాలయములో నొకఱాతిపలకమీద వ్రాయించిన శాసనములో నుదాహరింపబడిన గాథలలో శాలివాహనశకము ౧౧౭ (117) క్రీ.శ. 195 వ సంవ్వత్సర ప్రాంతమున నొకమాధవవర్మ యనురాజు కలదనియు, అతని కుమారుడు చింతగింజల నమ్ముకొని పొట్టపోసికొనెడి యొక స్త్రీ యొక్క బిడ్డను సంహరించినందున రాజు

విచారించి తన కొడుకుమీఁద నేరము ఋజువైనందున న్యాయపక్షము నేపూని కొడుకునకు నురిశిక్ష విధించె ననియు, అందుపైని మల్లేశ్వరస్వామి యాతని న్యాయబుద్ధికి సంతోషించి యాతనిపై సువర్ణవర్షమును గురిపించి యాతనిపుత్త్రుని బీదరాలగు నా స్త్రీ యొక్క పుత్త్రుని మరల సజీవులను గావించెననియు, మల్లేశ్వరుడు మాధవవర్మ యొక్క కీర్తిని భూమిపై స్థాపితము చేసె ననియు, నీ మొదలు గాఁ గలవిషయములు పేర్కొనఁబడినవి." [1] (1. Report on Epigraphy No.665, Public, 28th July, 1810, Part II, Pages 81 - 82, Paras 8 and 9).

ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము రచయిత కుందూరి ఈశ్వరదత్తు, బి.ఏ. వారి పుస్తకము  పేజీ నెం.238 నుండి.

## బెజవాడ విషయము

బెజవాడ కృష్ణానదీతీరమున, ఆంధ్రప్రదేశమునందలి సుప్రసిద్ధ నగరములలో నొకటి.  ఈ పట్టణము క్రీ.శ. ఆరవ శతాబ్దమునుండియు వాసిగాంచినట్లు సారస్వత, శాసనాధారములు గలవు.  విజయనగర రాజ్యాధిపతులైన పూసపాటి వారికి మూలపురుషుడైన మాధవవర్మయను నతడు కొందఱు రాచవారితో కృష్ణానదీతీరమున బెజవాడకు వలసవచ్చి, కాలక్రమమున రాజ్యము నొకటి స్థాపించినట్లు తెలియుచున్నది.  బెజవాడ మల్లేశ్వరస్వామి వారి యాలయములో నొక శాసనమున నితనిగూర్చి యొక గాథ కలదు.

మాధవవర్మ పుత్రునొకనిచేత చింతకాయ లమ్ముకొని జీవించు స్త్రీ యొక్క కుమారుడు హతుడుకాఁగా నారాజు ధర్మసంరక్షణార్థము తన పుత్రుని వధింప, మల్లేశ్వరస్వామి ప్రీతుడై బంగారు వర్షమును గురిపించి, ఇద్దఱు కుమారులను బునర్జీవితుల గావించెను.  ఆ శాసనములో జెప్పబడిన సంవత్సరము శ.స. 54. ఈ మాధవవర్మయే, విష్ణుకుండిన మాధవవర్మ కావచ్చుననియు, నా సంవత్సరమునుండియు, నతడు బెజవాడ నుండి  రాజ్యపాలనము గావించుచుండెననియు జరిత్ర పరిశోధకుల యూహ.

"శ్రీమద్విజయ వాటాఖ్యపురే కృష్ణా విభూషణే

కకా శ్రీమచ్ఛకాబ్దేబ్ది శశిసాయక సమ్మితే
రాజా మాధవవర్మా భూద్విఖ్యాతో ధరణీతలే
తతస్వపుత్రేణ హతే తింత్రిణిజీవిని సుతే
ధర్మసంరక్షణార్థాయ స్వపుత్ర మవధీత్సరాట్
తతో మల్లేశ్వరప్రీత: స్వర్ణవృష్టిం వవర్షచ
శిశుపుత్రకయో : ప్రాణం దత్తవాంస్తస్య కీర్తయే.

ఈ మాధవవర్మనే దగ్గుపల్లి దుగ్గయ్య తన నాచికేతో పాఖ్యానములో నిట్లు కీర్తించి యున్నాడు.

సీ. చతురంగబలములు జయవాద దుర్గాంబ
వరమునం బడసి దుర్వారలీల,
జగతీస్థలంబెల్ల సాధించి జయశాసన
ములు దిగ్దంతి దంతములసలిపి,
పేదబాలునకుగాఁ బ్రియసుతు మోహంబు
పట్టక బెజవాడ బాడినిలిపి,
కలయంగ బురమున గాంచనవర్షంబు
గురియించి దేవతా కోటిపొగడ.

గీ. "వసుధనెగడిన మాధవవర్మ".

శ్రీ తుమ్మలవెంకటరత్నం గారి రచన "దగ్గుమిల్లి నుంచి గోవాడ దాకా" నుండి పేజీ నెం. 5.

"శ్రీనాధుడు : వేమారెడ్డి మంత్రులతో శ్రీనాధుని తంద్రితాతలకు ఓరుగల్లులో పూర్వపరిచయాలుండేవి. శ్రీనాధుడు కూడ చందోలు కోటలో మంత్రులతో ఉద్యోగులతో పరిచయాలు సంపాదించుకొన్నాడు. ఆయన అప్పుడు నిండు యౌవనంలో వున్నాడు. చాలా కావ్యాలు రచించాడు. కవితా ఖ్యాతి గడించాడు. ఇంకా పెళ్లికాలేదు. తన వూరు పొన్నపల్లికి రెండు క్రోసుల దూరములోనిది దగ్గుమల్లి. కన్యాన్వేషణ జరిగింది. దగ్గుమల్లి తిప్పన్న

గారమ్మాయిని వరించి చేసుకొన్నాడు శ్రీనాథుడు. ఎర్రమ్మ కూతురి అదృష్టంవల్ల దగ్గుమల్లి శ్రీనాథకవిసార్వభౌముని అత్తవారివూరైంది. తిప్పన్న అల్లునికి పొన్నపల్లి వద్ద పొలం వున్నదని ముందే తెలిసికొన్నాడు. పాండిత్యంతోపాటు స్థిరాస్తికూడ వున్న అల్లుడు లభించినందుకు తిప్పన్న ఎంతగా సంతోషించాడో !

శ్రీనాథుని బావమరదులు ముగ్గురు. వారు పోతన్న, ఎర్రన్న, దుగ్గన్నలు. పోతన్న భాగవతం వ్రాసిన బమ్మెరపోతన్నకాదు. దుగ్గన్న బాలుడు. బావగారివద్దనే కావ్యనాటకాలంకార శాస్త్రాది పాఠాలు చదువుకొని క్రమంగా కవిత్వం వ్రాయనేర్చాడు. "అర్థహృద్యమధురోక్తులతో" నాసికేతో పాఖ్యానం వ్రాసి చెందలూరి గంగన్నను మెప్పించి రసికుల నలరించాడు. తన పుట్టువుచే దగ్గుమల్లికి ధన్యత్యం చేకూర్చాడు దుగ్గన్న. శ్రీనాథుడు సతీసమేతంగా నిత్యం సోమేశ్వరునర్చిస్తూ, శృంగారనైషధం రచిస్తూ రెండుక్రోసుల దూరంలో నున్న చందోలు వెళ్లి రాజోద్యోగులతో ఇచ్చకాలాడి మహామంత్రి మామిడి సింగన్నకు తన నైషధ కావ్యం చదివి వినిపిస్తూ వుండేవాడు.

పై గాథలనుబట్టి క్రీ.శ. రెండవ శతాబ్ది చివరలో జీవించిన మాధవవర్మకు చెందిన గాథను గూర్చి 12వ శతాబ్దమందు వేంగి సామంతుడుగా నుండిన పల్లకేతభూపాలుడు బెజవాడ మల్లేశ్వరస్వామి ఆలయములో శిలాశాసనము వేయుట మరియు ఈ కథనే దగ్గుపల్లి దుగ్గయ్య (దుగ్గన) తన నాచికేతోపాఖ్యానములో వివరించుట జరిగినది. తన కవిత్వమందు వాడిన పదజాలము "జయవాద - దుర్గాంబ - జయశాసనములు" జైనసంప్రదాయానుసారి యని తెలియుచున్నది. 12 వ శతాబ్దము మధ్యలో మల్లికార్జున పండితారాధ్యులు తాలూకు వీరశైవమూక తన స్వగ్రామ ధ్వంసమునకు పూనిన సంధర్భమును - 13వ శతాబ్ది మంచన తనకేయూరబాహు చరిత్రలో భగ్యంతరముగనైనను ఋజువుపరచిన వేళ - 14-15 శతాబ్దముల నివసించిన దుగ్గన తన గ్రామ దాడిని ఎచ్చటను - ఎందుకు వర్ణించలేదు. దీనిని మరొక కోణములో చూచిన దుగ్గన - దగ్గుపల్లి ఏది - ? అనుటకన్నను శ్రీనాథ - దుగ్గనలు సంచారులు - జీవనాన్వేషకులు.

దుగ్గన వ్రాసినవి 1. కాంచీ మహత్యము, 2. నాసికేతోపాఖ్యానము. కాంచీమహత్యము శివకంచిని గూర్చినది. దీనిని ఉదయగిరిని పాలించే పూసపాటి బసవరాజుగారి కొలువులో వుండే చెందలూరి దేవయ్య మంత్రికి అంకితమిచ్చెను. చెందలూరి దేవయ్య మంత్రి పెదతండ్రి కొడుకు గంగయ్య మంత్రి. దేవయ్య మంత్రికి కాంచీమహత్యము అంకితమిచ్చుటచేత దుగ్గన్నను, నాసికేతోపాఖ్యానము వ్రాయవలసినదిగాను, తనకు అంకితమివ్వ వలసినదిగాను గంగయ్య మంత్రి కోరెను. గంగయ్య మంత్రి ప్రోత్సాహంతోనే దుగ్గన నాసికేతోపాఖ్యానము వ్రాసెను.

సంస్కృత ప్రాకృత శౌరసేనీముఖ్య భాషా పరిజ్ఞానపాటవంబు

బన్నగపతి సార్వభౌమభాషితమహాభాష్య విద్యాసమభ్యాసబలము

నక్షపాదకణాదపక్షిలోదీరిత న్యాయక ళాకౌశలాతిశయము

శ్రుతి పురాణాగమస్మృతిసాంఖ్య సిద్ధాంతకబళనవ్యుత్పత్తిగౌరవంబు

పూర్వకవిముఖ్యవిరచితాపూర్వ కావ్య

భావరససుధాచర్వణ ప్రౌఢతయును

గందళింపగ గాశికాఖండనైష

ధప్రముఖవివిధ ప్రబంధము లొనర్చి.

కవిసార్వభౌముడై కర్ణాటవిభుచేత గనకరత్నాభిషేకములు గనిన

శ్రీనాధసుకవి కూరిమిసేయు మరిదివి దుగ్గయ కవిరాజ ! దగ్గుబల్లి

తిప్పనార్యునకును సతీమణి యెఱ్ఱమకును దనూజుడవు పోతనకు నెఱ్ఱ

నామాత్యవరునకు ననుగుదమ్ముండవు శాండిల్యగోత్రుడౌ సరసమతిని

చెప్పనేర్తువు కృతులు సుస్థిరముగాగ

గాన నీవు రచింపంగ గడగియున్న

నాసికేతచరిత్రంబు నాదు పేర

నంకితముసేయు కవిరాజు లాదరింప. (నా.సి. 1-18, 19)

ఇలా కృతి అడగడానికి ఇంకొక కారణం తన పినతండ్రి కుమారునికి దుగ్గన శివకాంచీ మహాత్మ్యం అంకితం ఇవ్వడం కూడ అయివుంటుంది. ఆ సంగతి ఈపద్యంలో చెప్పాడు.

మా పినతండ్రి గంగయ యమాత్యశిఖామణి తత్తనూభవుం

డై పెనుపొందు దేవసివాగ్రణి కిచ్చితి వంద్రభాషగాం

చీపురనాధు దివ్యకథ చిత్రతరంబుగ విస్తరించి నీ

వోపుదు వార్యహృద్యమధురోక్తుల సత్కృతు లొప్పజెప్పగన్.

(నాసికేతోపాఖ్యానం, 1-20)

నిజానికి దుగ్గన్న అంతవాడే, ఆర్యహృద్యమధురోక్తులతో సత్కృతు లొప్పేటట్టు చెప్పడానికి ఓపినవాడే. చిన్నకథను తీసుకుని చిత్రతరంగా విస్తరించి వ్రాయగల్గిన జాణడే.

నాసికేతోపాఖ్యానం అనే గ్రంథంలో దుగ్గన ఇలా చెప్పుకున్నాడు.

ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర కవిసార్వభౌమ సకలవిద్యాసనాథ శ్రీనాథమహాకవీంద్రప్రసాదలబ్ధ కవితా విశేష దగ్గుపల్లి తిప్పనార్య ప్రియతనూజ దుగ్గననామధేయ ప్రణీతంబైన నాసికేతోపాఖ్యానం బను మహాప్రబంధంబు.

శ్రీనాథుడు అనేకమందికి రాజులచే అగ్రహారములు ఇప్పించినసూ తన బావమరిది, శిష్యుడు అయిన దుగ్గనకి లేక ఇతర బావమరుదులకు ఎందుకు అగ్రహార దానములు లేక రాజాశ్రయము ఇప్పించలేదో తెలియరాదు. మరియు శ్రీనాథునిది పొన్నుపల్లి (కరగ్రామము) అయిన తనకో లేక తన బావమరిది దుగ్గనకో అగ్రహార దానము చేపట్టక భాస్కర పండితులకును, తదుపరి భాస్కర పండితుని మనుమడు సింగరయ్యకు ఇచ్చుట జూడ పొన్నుపల్లి శ్రీనాథుని స్వగ్రామమనునది సందేహించవలసి వచ్చుచున్నది, అనుకొనుట కన్ననూ భాస్కర పండితుని జీవనరవళి - శ్రీనాథ హృదయమును గప్పిన దనుకొనుట మేలు.

# 18. గోవాడ - దగ్గుమిల్లిలు ఈశాన్య స్థలమును పోగొట్టుకొనుట

గోవాడ - దగ్గుమిల్లిలు స్థలవాస్థులో విలువైన స్థలం దైవస్థానం ఈశాన్యమును కొంత పోగొట్టుకొనుట.

## 1) పెరవలి కైఫియత్తు

పూర్వ వర్తకులు యగుమతి దిగుమతిలు చేస్తూ పంటకాలువగా చెశి వుండెది. గన్కు వకవర్తకుడు బహుధనం సంపాదించ్చి అపాటిమిదను స్థాపనచెశి ఆపయిని భైరవ మంత్రోద్ధారణచేసి, యిక్కడ ధన నిక్షేపం చేశ్ని సంగతి కాశీలో శాసనం వేసినారు. గన్కు కొంతకాలమునకు కందర్పుడనే సన్యాసి ఆ శాసనం చూచినంతలో సదరహి జాగాలలో భైరవ పరిపాలితమైన ధనం వున్నట్టు తెలిసి అక్కడ నుంచి వెమూరు వచ్చిచూచి అక్కడనుంచ్చి చోడదేశానకు వచ్చి రాజ్యంచెస్తూ వున్న కుళోత్తుంగ చోళరాజుతోటి ధనవృత్తాంతం చెప్పి ఆగపరుస్తాను రమ్మనుమని చెప్పినంత్తలో రాజువిని యెనుగులు వంటెలు బండ్లు వగయిరాలు తిన్కుని సెనాసమేతముగా బయలుదెరి వెమూరికి వచ్చినంత్తల్లో ఆయతిశ్వర్లు భైరవుడు కాశికి వెళ్ళిన కాలం కనిపెట్టి ధనం తియించుమని అనతిచ్చె గన్ను రాజుధనం తియించి యెనుగులు వంటెలు బండ్లు వగయిరాల మిదను కట్టించ్చి వేమూరు పెరవలి సరిహద్దుకు వచ్చెవర్కు యెడు ఘడియలు అతిక్రమించి భైరవాగమనకాల సంప్రాప్తిమయ్యిందున్ను భైరవుడువచ్చి ఆవహించె వర్కు బండ్లు తరలకపాయ గన్కు ఆసంగతికి సంన్యాసికి తెలిశి భైరవ ప్రార్థన చెసె వరకు భైరవుడు చెప్పిన సంగతి బహుదినములనుంచి నాచెత పరిపాలితమైన ధనం మింమ్మునపహరించనివ్వనన్ని ఘట్టిగా హరించెటట్టాయనా మీ యిద్దరిలో నొకరు బలిగమ్మని అంన్నాడు. గన్కు రాజుతో చెప్పినందున్ను రాజు తాను బలిఅవుతాను అని అన్నందున్ను యతీశ్వరుడు నీవు అఖండ భూమండలాధిపతివి నివల్లనుంచిన్ని యీ ద్రవ్యం ధర్మానకు వినియోగం కావలెను. నేను బలి అవుతాను అని చెప్పి భైరవార్పణమని బండ్లకు అభిముఖంగా పండుకొన్నందున్ను బండ్లు పైగాతోలెవర్కు

ఆసంన్యాసి మృతినొందినాడు గన్కు భైరవుడు బలిపుచ్చుకొని చక్కాపాయను గన్కు ఆరాజు ధనంతోలించ్కుని పెరవలి ప్రవేశించెవర్కు బ్రంహ్మాహత్యా సంభవించినది సన్యాసి మృతినొందిన స్తలమందు బలిగుంట్ల అనేనామం యెర్పఁరచి చర్వుతవ్వించ్చి పెరవలిలో తద్దోష వరిహారార్థమై వంచలింగ్గ ప్రతిష్ఠ శాయుడాన్కు వువక్రమించి గ్రామాన్కు వుత్తరభాగమందు కందర్పేశ్వతుడు తూవ్రుఁభాగమంద్దు సుగ్రీవెశ్వరుడు దక్షిణభాగమంద్దు చంద్రశేఖెశ్వరుడుంన్ను పడమటి భాగమంద్దు రామేశ్వరుడుంన్ను కుడిభాగమంద్దు కేశవస్వామిని యడమ భాగమంద్దు మాధవస్వామివార్కి ఆలయం కట్టించ్చి యీ స్వామివార్లఁకు శా ౧౦౪౨ శక (1120 క్రీ.శ.) మంద్దు ప్రతిష్ఠచెశి నిత్య నైవేద్య దీపారాధన మహోత్సవములు జరిగించ్చ గలందులకు వృత్తి యెర్పాఁటుచేసి ముంద్దు సాగివెళ్ళినాడు.

## 2) నిడుబ్రోలు కైఫియత్తు

పూర్వం నుంచ్చి యీగ్రామాన్కు నిడుబ్రోలు అనే పేరు వుంన్నది. శాలివాహనం ౧౦౭౯ (1117 క్రీ.శ.) శకం లగాయతు కుళోత్తుంగ్గ చోళ మహారాజు రాజ్యం చేస్తూ వుండే దినములలో కాశీలో వఖయతీశ్వరుడు నివాసంగ్గా వుండి మణికర్ణికా ఘట్టానను స్నానాన్కు వెళ్ళి అక్కడ వకశాసనపు బండ్డ వుండగా పరీక్షించ్చేవరకు శీమలో వేమూరు అనే గ్రామాన్కు తూపుఁభాగాన అరకలపాడు అనేపాటి మీదను అనేకమయ్ని ధనం వున్నట్టును అధనాన్కు కాలభైరవుడు కావలి వుండ్డి నిరంత్తరం గంగ్గా స్నానాన్కు వెళ్ళి యేడుఘడియలకు తిరిగి వచ్చి ప్రవేశించ్చునన్నట్లుగా తాత్పర్యమాయ గనుక ఆ యతీశ్వరుడు గ్రహించ్చినవాడై కాశినుంచ్చి బైలుదేరి వేమూరు ప్రవేశించ్చి ఆ గ్రామాన్కు తూపుఁభాగాన ఆర్కెలపాటి మీద ధనం వుంన్న ప్రదేశంకని అక్కడినుంచి చోళరాజు దగ్గరకు వెళ్ళి ధనవృత్తాంత్తం భోధపరిచి రాజును వెంట బెట్కుని వేమూరు ప్రవేశించ్చి భైరవుడు కాశికి వెళ్ళిన సమయం కనిబెట్టి స్తలమంద్ను ఆగమంచె యించి భూమితవ్వించ్చి అన్కే మంద్ది కోమాటీలచాతను ధనం తీయించ్చి బండ్లమీదను యేనురులమీదను వంట్టెల మీదను కట్టించ్చి తలిఁంచ్చె వరకు భైరవాగారు

కాల పరిమాణం యేడు ఘడియలకు మించ్చి భైరవుడు వచ్చి ఆవహించ్చి బండ్లు కదలకుండ్డా పట్టి మీ యిద్దరిలో వఖరు బలి అయి పదార్థంతోలుకో పొమ్మను మనిభైరవుడు చెప్పె గన్క యతీశ్వరుడు రాజును చూచి నీవు యీ ధనం చాతను నిత్య శివలింగ్గ ప్రతిష్టలు చేయమనింన్ని ఆఫలం తనకు ధారాపొయ్యమనింన్ని శివప్రతిష్టలేనిది నీవు భోజ్నం చాయవద్దనింన్ని యీ ప్రకారంగ్గా వచింన్ని వాడయి యతీశ్వరుడు బలి అయినాడు అటు తర్వాత చోడరాజు పధార్థం తొవ్వింమ్కని పెరవలిలోకి వచ్చి అక్కడ శివలింగ్గ ప్రతిష్ట చేసి విష్ణుస్తలముంన్ను నిర్మాణం చేయించ్చిన వారయి తదనంత్తరం చేబ్రోలు ప్రవేశించ్చి మహాదేవప్రతిష్టచేశి, ఆ స్తలం నుంచ్చి చంద్ధవోలు వెళ్ళుతూ నిడుబ్రోలులో శివాలయం కట్టించ్చి శాలివాహనం ౧౦౪౨ (1120 క్రీ.శ. ) శకమంద్ను చోడేశ్వరస్వామి వారు అనే లింగ్గమూర్తిని ప్రతిష్ఠ చేశి నిత్య నైవేద్య దీపారాధనలకు జరగగలంద్కు కు ౧ భూమి మాన్యం యిప్పించ్చి యీ గ్రామంలో పండ్డిన గొల్లాకు ఖ ౧ కి నం॥ ౦౪౦ మానెడు చొప్పున రాశికి నిత్య దీపారాధనలకు రోజు ౧ కి గం॥ ౮ చొప్పున యీ ప్రకారంగ్గా నిర్ణయంచేశినారు.

# 3) చందోలు కైఫియత్తు

కలియుగమందు యీ పట్నానకు చంద్ధవోలు అనే నామం చాతను ప్రసిద్ధి అయి యుధిష్టర విక్రమార్క శకములు అతిక్రమించ్చి శాలివాహనం ప్రవేశించిన తర్వాత జర్గిన క్రమం. చోళ దేశాధిపతి యైన అరుణాల చోళ మహారాజు యితని కొమారుడైన ధవళాంగ ముదిగొండ్డచోళుడు అతని కొమారుడు వీర విక్రమ చోళుడు ప్రభుత్వం చేశ్ని తర్వాత యితనికి యీశ్వరాంశ సంభూతులైన కరికాల చోళ మహారాజు జన్మించి ముక్కంట్టి మొదలయిన్న రాజులను జయించ్చి కావేరికి ఆనకట్టి కట్టించ్చి దివ్య ప్రభావ సంపంన్నుడై ప్రభుత్వం చేశి చనిన పింమ్మట అతకి కొమరుడైన కులోత్తుంగ్గ చోళ మహారాజు ప్రభుత్వానకు వచ్చి పరాక్రమం చాత సమస్త దేశాధిపతులను స్వవశీకృతం చేసుకొని చోళ మండలానికి రాజధాని యైన విక్రమాపుర శింహాసనంబ్బున ఆశీనుడై రాజ్యంబ్బు శేయు సమయంబ్బు

నంద్దు అష్టాంగ యోగ ప్రభావ సంపన్నుడైన ఒక యతిశ్వరుడు గంగ్గా యాత్ర వెళ్ళి వాణీకుర్ణకా ఘట్టమంద్దు స్నానం చేశి అక్కడ వక రాతి బండ్డ వుండ్డంగా దాని యందు శాసనాక్షరములు వుండ్డుట చూచి శ్రీకాణ్వయం విచారించ్చే వర్కు గంగ్గా దక్షిణ తీరమంద్దు కొండ్డ వీటి శీమలో చేరిన వేమూరు అనే గ్రామానకు నైరుతి భాగమందు భైరవ పరిపాలిత యై యుంన్న ధనం వుంన్నట్టుగా తెలిశె గన్కు అక్కడ నుంచ్చి ఆ గ్రామానకు వచ్చి శాసన ప్రకారఁగా విమర్శించగా అనేక ధనం వుంన్నట్టున్ను భైరవుడు నిత్యం కాశికి గంగా స్నానానికి వెళ్ళి యేడు ఘడియల్కు తిరిగి వచ్చి ఆ ధన ప్రదేశమందు వుంటూ వుండ్డే సంగ్గతింన్ని తన ప్రభావం వల్ల తెల్సుకుని అక్కడ నుంచ్చి శేతు యాత్ర వెళ్ళి శేతు స్నానముంన్ను రామేశ్వదర్శనముంన్నూ చేశి అక్కడ నుంచ్చిచోళ దేశానికి వచ్చి రాజు దర్శనం చేశే వర్కు రాజు చాలా సన్మానించ్చి పూజించ్చే వర్కు సంత్తోషించ్చి యితనికి యక్కువ అయ్ని యుపకారం చేయవలెనని రాజు తోటి ధన వృత్తాంతం చెప్పి యేడు ఘడియలలోగా ధనం స్వవశీ కృతంగ్గా చేసుకొని కాల భైరవుడు రాకమునుపే ఆ గ్రామం పొలిమేర దాటి రావలెనని శృతపరచే వరకు రాజు సంత్తోషించ్చి అనేగ యేనుగులు ఒంటెలు బండ్లు మొదలయిన్నవి తీస్కుని యతీశ్వర సహితంగ్గా వేమూరు ప్రవేశించ్చి భైరవుడు కాశి వెళ్లిన కాలం కనిపెట్టి ధనం తీశి యేనుగలు మొదలయ్ని వాటి మీదను పట్టించ్చి బండ్లు తెప్పించే వర్కు యేడు ఘడియల్కు మించ్చి నంద్ను భైరవుడు వచ్చి ఆవహించ్చి బండ్లు తర్లఁ చెయ్యక పాయ గన్కు యతీశ్వరునికి తెలిశి భైరవ ప్రార్ధన చేశ్తె అన్కె కాలములనుంచ్చి నాచాత పరిపాలితమై యుంన్న ధనం మీకు రానివ్వ ననింన్ని తథేమీరు యీ ద్రవ్యాపేక్ష చాతయింత్త అధేక్యమయ్ని శ్రమపడ్డారు గనుక యీ ద్రవ్యం యిక్కడ నుంచ్చి తీసుకొని పోవలెనని వుండ్డెనో మీయిద్దరిలో వొకరు బలిగా అయితే ధనం పోనిస్తాను అని చెప్పె గన్కు రాజు తాను బలిఅవుతాను అని నిశ్చయించ్చేవర్కు ఆ యతీశ్వరుడు రాజుతోటి నీవు అఖండ్డభూమండ్డలాధిపతివి నీవల్ల నుంచ్చి అనేక ధర్మాభివృద్ధి కాగలదని నేను యతీశ్వరుడింన్ని నిస్సంగ్గుంణ్నింనీ గనుక నేను బలి అవుతాను మీరు యీ పదార్ధము నిరాటఁఖ్యముగా గ్రహించ్చి నిత్యము శివలింగ్గ ప్రతిష్ట విధిగా చేస్తూ ధర్మాభివృద్ధి చేయుమని శలవుయిచ్చి ముంద్దుగా

వస్తూవుంన్న బండ్డికి సన్ముఖంగ్గా పడుకుండ్డి భైరవావర్ణణం అని వుంన్నంత్తల్లో బండ్లుపయిగా తోలిరి గన్కు ఆయతీశ్వరుడు మృతిచెందెను. తదనంతరం బండ్లు వగయిరాలు తోలించ్చుకుని ఆ వేమూరికి నైరుతి భాగమందు రెండు కోసుల దూరానవుంన్న పెరవలి అనే గ్రామంలోకి వచ్చె వర్కు యతీశ్వరసంమ్మంద మయ్ను బ్రంహ్మ హత్య రాజుకు సంభవించ్చి నందున్న యతి వాక్య పద్దతిని ఆ గ్రామంలో ఆలయుం కట్టించ్చి మల్లిఖార్జున లింగ్గముంన్ను ఒకటి మాధవరాయుడు అనే విష్ణు మూర్తిని ప్రతిష్ఠచేశి అక్కడనుంచ్చి నిడుబ్రోలు అనే గ్రామం వచ్చి అక్కడ శివాలయం ప్రతిష్ఠ చేశి తదనంత్తరం చందవోలు వచ్చినారు యీ స్తలములో చతుర్యోగములా వుచింప్పపడ్డ లింగోద్భవస్వామి వారి యొక్క ఆలయములు శిధిలీకృతములై అర్చనాది కృతములు జరుగకవుండి వుంన్నందున యిది గొప్పగా జర్గవలశ్ని స్తలం అని తోచి కైలాస ప్రస్థారముగా ఆలయములు నిర్మాణం చేయించ్చవలెనని విచారించ్చి సద్విధాన ప్రకరణములు తెలియగలందుల్కు ఆగమజ్ఞులవల్లను శిల్పికారుల వల్లను విచారించ్చే వర్కు మనస్సు సమాధానంగ్గా చెప్పలేకపోయినారు. గన్కు తను సంక్కల్పం అవునని బహువిచార గ్రస్తతగా వుండ్డి వుంన్నంత్తల్లో ఆరాత్రిలింగ్గోద్భవ స్వామివారు ఆరాజు మానసం చొప్పున సంకల్పశిద్ధి చేయవలశ్ని వాడై స్వప్న రూపముగా దృశ్యమయి యీ కైలాస ప్రస్థాన నిన్నర్ణయమునకు లింగ్గానుచితదానకు నాయంద్ద్ను నక్కల (నకల) ధానా గరిష్ఠుడయి తన యొక్క హృత్పద్మమె కైలాన ప్రసార నిన్నర్ణయముగా భావించ్చి తన్మద నివర్తనగు నంన్ను సంవ్విధాన అగమోక్త ప్రకారంగ్గా మానసే కంచేత వూజిన్సూ వుంన్న పూసులనయనారు అనే భక్తాగ్రంణ్యుడు యీ పట్నమంద్దే నివాసంచేశి పూసలు అంమ్ముకుంట్టు వుంన్నాడు. అతని దగ్గరకు వెళ్లితె కైలాసప్రస్థార విధానం యావత్తూ చెప్పగలడు అని తన భక్తుని మహిమ విస్తరింప్ప చెయ్యుమనేని ఎతద్విగఱంగ్గా వాక్యములు ప్రసాదించ్చి అంత్తర్థానుడయినందున్న రాజు మేలుకొచ్చి ఆత్యాశ్చర్యమనస్కుడై వుదయమందు లేచి ఆనయనారు వుంన్న స్తలం విమర్శ్నించ్చుకుని స్వప్న వృత్తాంత్తమాత్యంతముంన్ను వివరించ్చి నంత్తలో సంతోషించ్చి మరునాడు వుదయాన తన శివపూజ వేళకురంమ్మని చెప్పినంద్ను

తత్ప్రకారంగ్గా మరునాడు రాజు వచ్చినంత్తల్లో ఆ భక్తుడు తన నిత్య నియమం యావత్తు జర్పుకుని తదనంత్తరం రాజును యదటికి పిలిచి తదేక నిష్ఠాగరిష్ఠతచేత తన యొక్క వుదరం ప్రక్కలు కావించ్చేవర్కు ఆ వుదర మధ్యమంద్దు కైలాస ప్రస్థారవిధానం యావత్తు కనిపించ్చె గనుక రాజు అత్యాశ్చర్యపరుడై ఆ భక్తుని మహిమలు వన్ని౯స్తూ తత్ప్రకారం పఠమందు లిఖించ్చిన తదనంత్తరం ఆ భక్తుడు పూర్వపు విధానంగా మెచ్చె గన్కురాజు చాలా స్తోత్రం చేశి తాను లిఖించిన పటం శిల్పికారుడ్కి అగపడ్చి ఆ చొప్పున స్తల నిర్మాణముల చేయించ్చడాన్కు ఆరంభించ్చి శాలివాహనం ౧౦౪౨ శకమంద్దు (1120 క్రీ.శ. ) మధ్య గర్భ౯గుడి లింగోద్భవ మూత్తి౯ని ప్రతిష్ట చేశి చుట్టూ ఆవరణములు గాకట్టించ్చి లోపలినె పదహారు లింగ్గాలను ప్రతిష్ఠచేశి లింగ్గాల్కు అన్నింటికి అభిషేకం చేశ్ని వుదకం వక్క పానువట్టం సోమసూత్రం నుంచ్చి ప్రవహించ్చె లాగ్ను నిమా౯ణం చేయించ్చినారు. యీ స్తలమందు గర్భ౯గుడి అంత్తరానక ముఖమంట్టప ప్రముఖ మంట్టప గాలిగోపుర ప్రాకారములు కట్టించ్చి చుట్టూ వుపజగతి మహజగతి మొదలయ్నివి కనక సుందర మీమాంస శాస్త్రోక్త ప్రకారంగ్గా కట్టించిరి గనుక యీ ప్రకారముగా తయారు చేయించ్చె వర్కు వక సంవత్సరం అయ్నది గన్కు రాజుకు బ్రంహ్మాంత్తను గురించ్చి నిత్యం వక లింగ్గమును ప్రతిష్ఠ చేయవలశ్ని నియమం గన్కు మున్నూట అరవయి దినములు కొద్ది ఆలయములుగా కట్టించ్చె మజుకూరిలోనే మున్నూట అరవయి లింగ్గాలను ప్రతిష్ఠ చేయించ్చినారు. యీ ప్రకారముగా కట్టించ్చే ఆలయముల్కు రాజు చేరే నిమిత్తం పది అయిదు వేల బండ్లు వుంచ్చి రాళ్లు తెప్పిస్తూ వుండ్డగా బండ్లు పట్నం దరికి వచ్చి అక్కడ నుంచ్చి కదలక పాయ గనుక యే విధం వల్లను బండ్లు సాగించ్చే ఆలోచన తోచక రాజు చింత్త క్రాంతుడై వుండగా ఆ రాత్రి స్వప్నమందు శక్తి స్వరూపముగా వచ్చి నేను యీ పట్నానికి చతుర్యుగములను కనిపెట్టి వున్న గ్రామ శక్తిని నీవు తెప్పించ్చె బండ్లకు నేనే ఆటంక్కము చేశినాను. నీవు తెప్పించే బండ్లకు బండికి వకరాయి చొప్పున అక్కడ వేయించ్చి తనకు గుడి కట్టించ్చి ప్రతిష్ఠ చేసి వుత్సవములు జరిగించ్చుమనిన్ని అక్కడ తవ్వించ్చితే తన స్వరూపములో విగ్రహం వున్నదని చెప్పె గనుక తదనంత్తరం రాజు మహా సంత్తోషయుక్తుడై ఆ ప్రకారంగా బండికి వకరాయి చొప్పున

వేయించ్చి ఆలయం కట్టించ్చి ఆ స్థలమందు తవ్వించ్చితె శిలావిగ్రహం అగపడ్డది. గన్కు ఆ విగ్రహం గుళ్లో ప్రతిష్ట చేశి సకలోత్సవములు జర్గించ్చి బండ్లంమ్మ అని ఆ శక్తికి పేరు బెట్టినారు. విగ్రహం నిమిత్త జలధిమట్టు కంత వ్యాసంద్ధు మహా యోగ్యము లయ్యి పృథకం అపరిమితంగ్గా వున్నది గన్కు అది బావి కట్టించి ఆ బావికి బండ్లంమ్మ బావి అంట్టూ వున్నారు. లింగ్గోద్భవుంణ్ని ప్రతిష్ట చేశ్ని పెద్ద దేవాలయం తయారు అయ్ని తదనంత్తరం దక్షిణ భాగానకు వరిగినది. గనుక కాశీబత్తులు అందరూ విచారించ్చి నాగులు అనేవాడు విచారించ్చి వుత్తరపు పాశ్వాఁమందు జలధి మట్టుకు చరువుగా తవ్వించినాడు గన్కు ఆలయం వగ్గు తీరి తిన్నగా నిలిచి వున్నది. తదనంత్తరం ఆ చర్వున విస్తారపు నీరు నిల్చి పంట్ట చర్వు యేర్పాడి నాగులు అనేవాడు తీయించినందున్న నాగుల చర్వు అనే పేరు గల్గి యీ యేటికింన్ని పంట్ట చరువయి వున్నంది.

తర్వాత శాలివాహనం ౧౦౬౩ అగునేటి (1141 క్రీ.శ.) వుత్తరాయణ సంక్రాంత్తి మహ పుణ్యకాలమంద్దు శ్రీ మన్నహా మండ్డలేశ్వర కొండ్డ పడమటి బుద్ధరాజులుంగారు శీధనదు పోలీ శ్రీ పతిస్వర మహాదేవునకు నిత్య నైవేద్యములకు ఖండ్డెడు పుట్ల భూమింన్ని అఖండవత్తిాదీపానకు ౫౫ గొరియలు బంమ్మన బోయ్ని కొడుకు సూరెన బోయన కొమ్మన బోయ్ని కొడుకు భీమన బోయుడు వీరి పరఁగ్గా వుంచ్చి ఆ చంద్రాకాముగా నిత్యం మానెడు నెయ్యి సమపిాంచ్చేలాగ్ను నిన్నాయంచేశి నమాణ చేశి శిలాశాసనములు సంస్థాపించ్చినారు.

## 3) పాంచ్చాళవరం కైఫియత్తు

వూర్వం కుళోత్తుంగ చోళమహారాజు శాలివాహనం ౧౩౯౯ శకం (1477 క్రీ.శ.) లగాయతు ప్రభుత్వం చెస్తూ వుండి కృష్ణవెణ్యా దక్షిణ తీరమందు కొండ్డవీటి శిమలో చెరకిఇన వెమూరు అనె గ్రామానకు నైరుతి భాగమందు భైరవపరిపాలితమైన ధనం భైరవుంణ్ని యామరించ్ని హరింవాడై భైరవాగమ కాల సంప్రాప్తమయ్నిందున్న యతిశ్వరుంణి బలియిచ్చి ధనం తలిాంచ్కుని వచ్చె యడల రాజుకు బ్రహ్మహత్య సంభవించె గన్కు నిత్య శివలింగ ప్రతిష్ట విడిగా

నియామం చెసుకుని ఆదనం తలిఁచ్చుకుని పెరవలి వచ్చి అక్కడ శివలింగ్గ ప్రతిష్టచెశి అక్కడ నుంచ్చి చందవోలు ప్రవేశించ్చి లింగోద్భవస్వామి వారికి కైలాస ప్రస్థార విధానముగా ఆగమజ్ఞలయ్ని శిల్పుల చాత్న ఆలయములు నిర్మాణం చెయిస్తూ వుండ్డే యెడల ఆ శిల్పులయ్ని వారు ముఖ్యులు అయిదుగురు రాజుతోటి ....... చందవోలు నుంచిలెచి ప్రస్తుతం నామం గల పాంచాళవరం అప్పుడు వూరు లెకుండా దుబ్బులగుంట్ట తుంమచెట్లుగా వుండ్డగా మార్గఁవశాత్తున అక్కడికి వచ్చెటప్పటికి రాజుకు తెలిశి యకాయకు భటుసవారిని సదరహిగుంట దగ్గిర్కు వచ్చి పయ్ని వాళ్ని అయిదుగురు శిల్పులను సమాధానం చెశెయడల వారు సంమత్తించ్చి తమ కీర్తిఁశాశ్వతమై వుండవలెనని యీ స్థళ మంద్దు మాపెరట గ్రామం కట్టించి యీ స్తళమందు మీరు శివలింగ ప్రతిష్ట చెశి యీ గ్రామం మాకు అగ్రహారముగా దయశాయవలెనని కోరిరి గన్కు అదెప్రకారం రాజు సంమ్మతించ్చి ౧ అమృతలూరు ౧ గూడవల్లి ౧ పెరవలి ౧ నడిమివల్లి ౧ గోవాడ యీ అయిదు వూళ్లమధ్యమందుంన్ను గ్రామం కట్టించ్చి సదరహి గ్రామాదుల గుడికట్టులో కు ౧౦ యనభై కుచ్చళ్ల భూమి విడతీశి సదరహి గ్రామం కింది చెల్లెటట్టుగా నినఁయించ్చి యీ గ్రామం పంచాంణ్నులకు ధారగ్రహితముగా యివ్వబడ్డది గన్కు పాంచాల్లవరమని నామం యెర్పరచి కుళోత్తుంగ చోళమహారాజులుంగారు ఆద్నిం అక్కడ వశియించ్చి శివలింగ ప్రతిష్ట చెశి ఆ స్వామికి మల్లేశ్వరస్వామి అనె నామం యెర్పఁరచి సకల్సోవములు జరిగెటట్టుగా వసతులు యెర్పఁరచి అక్కడనుంచ్చి సదరహి వ్రాశ్ని శిల్పులను తీస్కుని వచ్చి చందవొలు ప్రవేశించి ఆలయములు కట్టిస్తూ వచ్చినారు.

పెరవలి, నిడుబ్రోలు, చంద్దవోలు, పాంచ్చాళ్ళవరం గ్రామ కైఫీయత్తుల ననుసరించి, పాలకొడ అను ఉప్పు కాలువ ద్వారా సముద్రమార్గమున ఎగుమతి దిగుమతులు జరిగేవని. వేమూరు వద్ద గల అర్గలపాడు ఉరఫ్ అరకలపాడు ఒకప్పుడు అట్టి వ్యాపార కేంద్రమని ఇచ్చట బహుధనము సంపాదించిన వ్యక్తి సదరు ధనమును భూస్థాపితము చేసి, కాశీలో శాశనము వేసెనని సదరు

శాసనమును పరిశోధించిన కందర్పుడను సన్యాసి క్రీ.శ. 1117 లో చందోలులో రాజ్యము చేయుచున్న కుళోత్తంగచోడరాజు-I తో సంప్రదించి ఆ నిధిని త్రవ్వించి తీసుకొని వచ్చునపుడు భైరవపాలిత శక్తివారిని అడ్డగించెనని కందర్పుడు ప్రాణార్పణ చేయగా సదరు బలి అయిన ప్రాంతము నేటి పెరవలి - వేమూరు మధ్య బలిగుంట వద్ద జరిగెనని ఇందులకు ప్రతిగా రాజు ప్రతినిత్యము ఒక శివలింగ ప్రతిష్ఠ చేసెడి నియమము వహించి చేయుచుండెడివాడని రాజు ధనమును తీసుకొని పోయిన త్రోవ పెరవలి నిడుబ్రోలు - చందోలు. ఈమూడు ప్రదేశముల శివాలయముల నిర్మించెనని - అటుల తనవద్ద గల ఆలయములను నిర్మించు ప్రతిభావంతులైన శిల్పులలో 5గురుకు అమృతలూరు, పెరవలి, గూడవల్లి, నడిమిపల్లి, గోవాడ, (దగ్గుమిల్లి)ల నుండి అయిదు ఖండములు విడగొట్టి - ఈ అయిదు ఖండములను ఏక ఖండముచేసి ఆ శిల్పులకు గ్రామ నిర్మాణము నిమిత్తము ఇచ్చెనని గాథ. ఇందు అమృతలూరు నుండి విడగొట్టబడిన భాగము అమృతలూరునకు ఆగ్నేయ భాగము పెరవలి నుండి విడగొట్టబడినది, పెరవలికి నైఋతీ భాగము, నడిమిపల్లి, గూడవల్లిల నుండి విడగొట్టబడినది. వాయువ్య భాగము కాగా గోవాడ నుండి విడగొట్టబడినది. గోవాడ - దగ్గుమిల్లుల ఈశాన్య భాగము. కనుక గోవాడ కోల్పోయినది ఈశాన్య దైవస్థలము. కనుకనే గోవాడకు దైవభాగము తగ్గినందున తదుపరి కాలములో కొన్ని కష్టనష్టముల నెదుర్కొనవలసి వచ్చెను. పై కథ యదార్థమని నమ్ముటకు - ఈనాలుగు కైఫీయత్తులు వ్రాశినది ఒక్కరు గాదు. కైఫీయత్తులు నాటికి పెరవలి కూచిపూడి సర్కారులో నుండగా నిడుబ్రోలు పొన్నూరు సర్కారులోను చంద్రవోలు నిజాంపట్నం సర్కారులోను పొంచ్చాళ్ళవరం పులివర్రు సర్కారులోను వున్నవి. (సర్కారు = సముతులు). మరియు చందోలు రాజధానిగ కుళోత్తంగచోడ (వెలనాటి రాజు క్రీ.శ. 1108-1136 మధ్య పరిపాలించినది గూడా యదార్థము. ఇతడు కుళోత్తంగ చోళ చక్రవర్తికి 1070-1118 అభిమానపుత్రుడుగ 16000 గ్రామములను ఇతడు పరిపాలించెను. కనుక గజ, తురగాదుల బలము ఇతనికి కలదు.

# 19. పండితారాధ్య చరిత్ర

ద్రాక్షారామంలో సనాతన బ్రహ్మణాచారాలున్న వానసభీమన్న గారి కుమార్డు అయిన మల్లిఖార్జునుడు ప్రక్క గ్రామనివాసియైన కోటిపల్లిలోని అవాంతరయ్య అనే ఆరాధ్యుని వద్ద శైవదీక్షను పొంది ఒల్లంతా విభూతి పూసుకొని,త్రిపుండరేఖలు దిద్ది శివపురాణంలో చెప్పినట్లు శిరస్సుకు, చేతులకు శిఖకు, చెవులకు, రొమ్మున, మెడలో రుద్రాక్షలు కట్టుకొని వీరమాహేశ్వరదీక్షను, వీరవ్రతాన్ని పాలిస్తున్నాడు.

ఆకాలంలో ఇతర ప్రాంతాలలో కూడ వీరశైవ మతాన్ని అనుసరించేవాళ్లు ఉండినారు. వాళ్లను ఒకపక్క నుంచి బ్రాహ్మణులు ఈసడించి బాధిస్తూ ఉండేవారు. మరోప్రక్క జైనులు, బౌద్ధులు యద్దేవా చేసేవారు. పోరండ్ల అగ్రహారంలో సూరసానమ్మ అనే ఒక వితంతువు వీరశైవ మతదీక్ష పుచ్చుకొని, జాతిభేదాలను పాటించక, పంచములను సైతం, భక్తులైతే, ఆదరించేది. ఆమె ఒకనాడు ఒక మాలవానికి ఇంట్లో అన్నం పెడుతున్నప్పుడు ఆ అగ్రహారంలోని బ్రాహ్మణ్యమంతా ఆ ఇంటిమీద పడి రోష్టు పెట్టారు. ఆమె వాళ్ల ముందర ధైర్యంగా నిలబడి, ఎలుగెత్తి కోపించి, అందరినీ శాంతింపజేసి, భక్తుల కథలు చెప్పి, పరమేశ్వరుని మహిమలు వివరించి, రొష్టుపెట్టడానికి వచ్చిన వాళ్లు గమ్మున సాష్టాంగపడేటట్లు చేసింది. ఈ సూరసానమ్మ పండితయ్యకీర్తి విని అతణ్ణి చూడడానికి వెళ్లింది. ఒక్కర్తే ; బెలిదేవి వేమనారాధ్యు డనే ఇంకొక భక్తునితో కలిసి వెళ్ళింది.

సుదూరం నుంచి వచ్చిన ఈ భక్తులు పండితయ్య గారి ఇంటికి చేరుకొనేసరికి ఆయన శివపూజ చేసుకొంటున్నాడు. వీళ్ల రాక చూసి, చేస్తున్న శివపూజకూడ మానివేసి, శివునికన్న శివభక్తులే గొప్పవాళ్లని, వచ్చినవాళ్లను వైనంగా పూజించాడు. సూరసానమ్మగారూ, వేమనారాధ్యుడూ ముక్కుమీద వేలువేసుకొన్నారు. అతని మతావేశం బండారు బసవన్నను మించిపోయి దనుకొన్నారు.

ఆరోజుల్లో వెలనాటి చోళులు తెలుగుదేశంలో చెప్పుకోదగ్గ రాజులు. ఇప్పటి గుంటూరు జిల్లా తెనాలి తాలూకాలోని చందవోలు వాళ్ల రాజధాని. దీనికి నదనవోలు, ధనదుపురం అనే పేర్లుకూడ ఉండేవి. ఈ ఆస్థానంలో జైనబౌద్ధమతాలకు ఆశ్రయముండేది. రాజగురువు బౌద్ధపద పదాచార్యుడు. ఈ బౌద్ధుణ్ణి ఓడించి రాజును తన మతానికి తిప్పుకొంటే బాగుంటుందని పండితయ్య తలచినట్లుంది. శిష్యవర్గాన్ని తీసుకొని వెలనాటి చోళుల రాజధానికి వచ్చాడు. నగరంలో తన మతాన్ని ప్రజలకు బోధించసాగాడు. రాజగురువుకు సహజంగా ఒళ్లు మండింది. సభ పెట్టించమని రాజును కోరాడు. పండితయ్యను అతని మతాన్ని విశదీకరించమన్నాడు.

రాజు సభ పెట్టించాడు. ఆ సభలో జైనులు, బైద్ధులు, సాంఖ్యులు, అద్వైతులు, చార్వాకులు,

లోకాయతులు మొదలైన నానాదర్శనాల వాళ్లూ ఉన్నారు. ఆ సభలో పండితయ్య తన మతాన్ని వివరించడమేకాక బౌద్ధమతాన్ని, దానితోపాటు మిగతా అన్ని మతాలనూ ఖండించాడు. శేషం కోపంతో పూరించ మన్నట్లు అంతటితో ఊరుకోక శివుణ్ణి మించిన దైవం లేడని చెప్పడానికి తన తల ఇస్తానన్నాడు. నిప్పు ముట్టుకొంటానన్నాడు. శివునికన్నా వేరే దైవ మున్నాడని ఎవరైనా చెప్తే వాళ్ల తల తనకాలితో తంతానన్నాడు. ప్రతిజ్ఞ చేశాడు. ఈయన ఇలా తిట్లలోకి దిగితే మిగతావాళ్లు ఊరుకొంటారా ? పైగా రాజాశ్రయమున్న బౌద్ధగురువు నోరుమూసుకొని ఉంటాడా ? అతడూ పండితయ్య భాషలోనే మాట్లాడి ఉంటాడు.

ఇది పండితయ్య శిష్యులకు కోపం కలిగించింది. తమ గురువును నిందించిన బౌద్ధుని ద్రోహంకన్నా, అతణ్ణి ప్రాణాలతో పోనిస్తే తామే ఎక్కువ ద్రోహుల మవుతామని పండితయ్య శిష్యులలో రేమయ్య, దేవయ్య అనే ఇద్దరు కంకణం కట్టుకొని ఈ పనికి పూనుకొన్నారు. తమదగ్గరున్న సరుకంతా వెంటనే అమ్మివేశారు. ఇతరు లెవరూ చూడకుండా బౌద్ధుణ్ణి అనుసరించారు. ఆయన చందవోలు దగ్గర సముద్రంలో ఉన్న ఒక లంకలోని బౌద్ధారామంలో రోజూ ప్రార్థన చేస్తూ ఉంటాడని తెలుసుకొన్నారు. మర్నాడు వేకువఝామున మారువేషాలు

వేసుకొని లంకలోని బౌద్ధాలయానికి వెళ్లారు. అక్కడ పొంచి ఉండి బౌద్ధగురువు రాగానే మీదపడి, పొట్ట చింపి, పళ్లూడగొట్టి, పండితయ్యను తిట్టిన నాలుక చూపించమని అడిగి, దానిని తరిగి, రొమ్ము తొక్కి, పేగులు పీకి, తల తెంచి, దానిని పొట్టలో పెట్టి కట్టి, 'ఇది అసంఖ్యాత మాహేశ్వరుల పనుపు' అని ఉత్తరం రాసిపెట్టి రొమ్మున ఉంచి వెళ్లిపోయారు.

ఈ ధారుణహత్య సంగతి రాజుకు తెలిసింది. రొమ్ము నున్న లేఖను చూశాడు. పండితయ్యను పలిపించి అడిగితే, "ఇది నేనే చేయించాను, నేనే చంపించాను" అని, నిర్భయంగా ఒప్పుకొన్నాడు. ఈహత్యకు శిక్షగా రాజు పండితయ్యను చంపించక జీళ్ళపాలు తెప్పించి కళ్లలో పోయించి, అవిమట్టుకు తీయించాడు. పండితయ్య 'రాజు సర్వనాశనమవుతా' డని శపించాడు. ఆ శాపం ఫలించేదాకా తనకు మళ్ళీ కళ్లు ఇవ్వవద్దని దేవుణ్ణి వేడుకొన్నాడు.

" పశుపతి మీ భక్తిపరులు 'శాపాద
పి శరాదపి' యనంగ పెనుద్రోహి ద్రుంచు
నంతకు......."

"కన్ను లిస్తే నీభక్తు లాన" అని ఒట్టుపెట్టాడు. 'శాపాదపి శరాదపి' అనడంలో ఔచిత్య ముంది. శాపం వల్ల ఒక వ్రణం పుట్టి రాజు మరణించా డంటారు కాని దానివల్లకాక పండితయ్యగారి అనుచరుల శరంవల్లనే రాజు మరణించాడు. ఈ సంగతి విశ్వసనీయమైనదే.

శాపం పెట్టాక పండితయ్య చందవోలు నుంచి అమరావతికి వెళ్ళాడు. దేవుణ్ణి వివిధ స్తుతులతో కీర్తించి, కృష్ణానదిలో ఒడ్డోలగం ఏర్పరచి భక్తులతో "మనం వెలనాటి సీమ నుంచి వెడలివచ్చాం. వాడు చస్తాడు. మన కళ్లు వస్తాయి." అని చెప్తూ ఉండగా

"అంతలోననె ఫణిపతిరి యాద్రోహి
నంతకు ప్రోలికి ననిపి యేతెంచి
నలి భక్తతతికి విన్నప మాచరింప......"

పండితయ్య సంతోషించాడు.

" ఈ ఫణిహారి ఎవడు ? చోడని ఫణిహారియు కావలయును. వ్రణబాధితుడై చోడుడు మృతినందుట వాస్తవమైనచో ఫణహారి యా ద్రోహి నంతకపురి కనుచుట పొసగి యుండదు; చంపుట వాస్తవమైనచో వ్రణబాధచే జచ్చుట వాస్తవమైయుండదు. చోడని నంతకపురి కంపివచ్చితి నని ఫణిహారి పండితారాధ్యులకును, భక్తతతికిని విన్నవించుకొనుట చూడగా నతడు పండితారాధ్యుల శిష్యవర్గములోనివా డనియు, రేమయదేవయలు గుర్వాజ్ఞమీదనో, లేకయో బౌద్ధగురుని హింసించి చంపినట్లు అతడును వెలనాటి చోడని హత్యచేసి చంపెనని తోచుచున్నది." అని నేలటూరి వెంకటరమణయ్య గారు కూపీతీశారు.

పండితయ్య అమరావతిలో ఉంటున్నప్పుడే అతనికి బండారు బసవన్నదగ్గర నుంచి కబురువచ్చింది. అంతకుముందు బసవన్నకూ, పండితయ్యకూ ఉత్తరప్రత్యుత్తరాలో లేక దూతల ద్వారా సంప్రతింపులో జరుగుతూ ఉన్నాయి. 'జందెం తీసి జాతి విడిచి తనలో వచ్చి కలియ' మని బసవన్న పండితయ్యను కోరాడట. దానికి సమాధానమిచ్చి పండితయ్య తన అనుచరులను బసవయ్య దగ్గరకు పంపించాడు. వాళ్లు బసవన్న సందేశాన్ని, దానితోపాటు వీభూతిని తీసుకొని వచ్చారు. పండితయ్య అప్పటికే కన్నడ భాషను నేర్చుకొంటున్నాడు కాబోలు. బసవన్న పంపించిన వీభూతిని ధరించగానే పరవశత్వంతో ఆభాషలో కవిత్వం చెప్పసాగాడు. బసవన్నను కలుసుకోవడానికి కల్యాణ కటకానికి బయలుదేరాడు.

దారిలో నల్లగొండజిల్లాలో ఉన్న పానుగల్లులో మకాం చేశాడు. ఆ ఊరు ఇంకొక శాఖ చోడరాజులకు ముఖ్య పట్నం. దానిని అప్పుడు ఉదయచోడుడు పరిపాలిస్తూ ఉండేవాడు. ఇతడు వేములవాడ భీమకవి ప్రశంసించి, పద్యాలు చెప్పిన మైలమభీముని సోదరుడు. ఆ రాజ్యపు కోశాధికారి అయిన గోవింప్రగ్గడ పండితయ్యకు ముఖ్యశిష్యుడు. తన గురువు గారికి రాజోచిత సేవలు చేశాడు. మిగతా ఉద్యోగులు, పరివారం చాలామంది పండితయ్య శిష్యులయ్యారు. రాజును సేవించడం మానివేసి పండితయ్య కొలువులో ఉండి పోసాగారు. రాజు తన స్వంత సేవకుడైన ధన శేశు నామయ్య విధులు నిర్వర్తించలేదని ఆగ్రహించాడు.

నామయ్యకు పౌరుషం వచ్చి "ఈ బొంది మీది కాని, నా ఆత్మ మీది కాదు. కావాలంటే మీశరీరం మీరు తీసుకోండి." అన్నాడు. రాజు చేతిలోని చురియను తీసుకొని గోపురం మీది కెక్కి తల గండరించుకొన్నాడు. తన ఉద్యోగులను విద్రోహుల కింద మారుస్తున్నాడని రాజు పండితయ్యను నిందించాడు కాబోలు, ఆ రాజుమీద కూడ శాపాలు పెట్టి, బసవన్నను కలుసుకోవాలని పండితయ్య కల్యాణకటకం దారిపట్టాడు.

అయితే, దారిలోనే దారుణమైన బసవన్నమరణ వార్త తెలిసింది. అన్ని మతాలవాళ్లనూ ఒక్కలాగ చూడవలసిన ప్రభుత్వాన్ని పాక్షికం చేసి బొక్కసంలోని ద్రవ్యాన్ని ఒక్కమతం వాళ్ళకే విరజిమ్ముతున్నందుకు రాజు బసవన్నపై ఆగ్రహించాడు. అందుచేత బసవన్న బిజ్జలుణ్ణి చంపించాడు. రాజ్యాన్ని వదిలి పారిపోయాడు. ఇది జరిగిన కొద్దినాళ్లకే బసవన్న మరణించాడు. బసవన్నను కలుసుకోవాలని ఎంతో ఉత్సాహంతో వెళుతున్న పండితయ్యపై పిడుగు పడినట్టయింది. ఆక్రోశించి, ప్రలాపించి అతడు శ్రీశైలం దారిపట్టాడు. బసవన్న మరణంతో పండితయ్య ప్రణాలే పోయిన ట్టయినాయి. కొండ ఎక్కే ఓపిక కూడ లేక పోయింది. తనకు బదులు శిష్యుణ్ణి కొండఎక్కి ఓపిక కూడ లేక పోయింది. తనకు బదులు శిష్యుణ్ణి కొండ ఎక్కి మొక్కు చెల్లించమని తాను కొండ అడివారంలోనే ఉండిపోయాడు. శిష్యులు గిరిప్రదక్షిణం చేసివచ్చాక తాను ఇంక జీవించవలసిన అవసరం లేదని తనువు చాలించాడు. అతడు మరణించినా అతని రచనలు జీవిస్తూనే ఉన్నాయి.

శివ భక్తులను చూచి జాతి మొదలైనవి అడగడం మానివెయ్యాలి.

శివభక్తులకు జబ్బు చేసినా, లేమి వచ్చినా, భయం కలిగినా ఆదుకోవాలి. తప్పకుండా వాళ్లకు మేలు చే[illegible].

రొంపిలో పుట్టినా పద్మం చాలా పూజ్యమైనట్టు ఎలాంటి కీడు కులంలో పుట్టినా శివభక్తుడు గొప్పవాడే.

కులం తక్కువవాడే శివభక్తుడైనందువల్ల గొప్పవాడవుతున్నప్పుడు కులమున్న వాడైతే ఇక చెప్పేదేముంది ? బంగారానికి తావి అబ్బినట్టే !

బ్రాహ్మణులు ఎలాగైతే వధకు అనర్హు లో విశభక్తులు కూడ అనర్హు లే.

కన్నడ దేశంలో వీరశైవాన్ని ప్రబోధించిన బండారు బసవయ్యా కూడ ఇంత నిర్దాక్షిణ్య దృక్పథాన్నే అలవరచుకొన్నాడు 'శివపసాయిత' మనే ఖడ్గాన్ని పట్టుకొని మరీ ప్రబోధించాడు. (పైగంబరు మహమ్మదుకూడ కత్తిపట్టుకొని మతప్రచారం చేశాడన్నది గుర్తుతెచ్చుకోదగ్గ విషయం). బండారు బసవన్న జాతిభేదాలను రూపుమాపి సామాన్య ప్రజలకు ఆత్మగౌరవాన్ని నిచ్చే దారి తొక్కినందుకు ప్రశంసనీయుడే. ఇటు కులరహితమైన మతాన్ని నెలకొల్పడానికి తెలుగుదేశంలో పండితయ్యాకు ముందు ఇతర శైవాచారపరులు ప్రయత్నిస్తూనే వచ్చారు. వందయేళ్ల ముందు బెజవాడలో శ్రీపతి పండితుడు మాలయింట భోంచేశాడు. అందుచేత తనను వెలివేసి తనకు నీళ్లు పుట్టనివ్వ కుండా చేసినవాళ్లకు నిప్పుపుట్టకుండా చేశాడు. ఉత్సాహంలో వివిధ కులాలవాళ్లు విభేదాలను మరచిపోయి ఒక ఉమ్మడి నమ్మకాన్ని అలవరుచుకొన్నారు. ఇటువంటి విశాల దృక్పథంతోనే వీరశైవాన్ని పండితయ్యా యౌవనంలో స్వీకరించి ఉండవచ్చునుగాని అతడు ఏటి కెదురీదలేక పోయాడు.

జందెము తీసి, జాతిని విడిచి వచ్చి తనలో కలియవలసినదిగా బసవయ్యా పండితయ్యాను కోరినట్లూ, దానికి పండితయ్యా సమాధానం చెప్పిపంపించినట్లూ ఇందాకా చెప్పుకొన్నాం. పండితయ్యా చెప్పిన సమాధానం ఏమిటంటే, "భక్తి మీద వలపు బ్రాహ్మ్యంబుతో బొత్తు, బాయులేను నేను బసవలింగ!" అన్నదే. ఇవాళటి కమ్యూనిస్టుల పరిభాషలో చెప్పాలంటే పండితయ్యా 'డీ-క్లాస్' అవలేకపోయాడు. తన వర్గాన్ని విడిచి విస్తృత ప్రజానీకంతో కలియలేకపోయాడు. ఒకరకంగా అతని సంస్కృత సంస్కారమే దీనికి అడ్డువచ్చి ఉంటుంది

# 20. కైఫియత్తులు - బుద్ధాం - చందవోలు

## బుద్దాం కైఫీయత్తు

తూర్పుదేశస్థుడు అయ్ను ఘవంట్టి వానసుడు (?) యీ దేశములు చూడవలయునని వచ్చినంత్తల్లో యా దేశ బ్రాంహ్మణులు సహ పంక్తి యోగ్యత యివ్వక పోయిరి గన్కు అభిమానియై శ్రీశైల పర్వతమునకు వెళ్ళి శ్రీ మల్లిఖార్జునస్వామి వారిదర్శనం చేసుకొని తదనంత్తరం ఆ పరబ్రహ్మరూపుణ్ణి గూర్చి తపస్సు చేసినంతల్లో కొన్ని దినములకు ఆయన భక్తి తాత్పార్యములకు అనుగ్రహించ్చి ప్రత్యేకమయిన కోరిక యిస్తున్నానని శెలవు యిచ్చిరి. గనుక తమకు వంశపావను డయినటు వంటింన్ని శివభక్తాగ్రగణ్యు డయినటు వంటింన్ని సకల వేద శాస్త్ర ప్రవీణుడయినటు వంటింన్ని కొమారుడు కావలెనని కోరినంద్ధున ఆ ప్రకారం ప్రసాదించి అంతర్థితుడయినాడు. అటు పిమ్మట మరి కొన్ని దినములకు దివ్యతేజోపుంజుడు అయినటువంటి కుమారుడు వుద్భవించ్చినంద్ను ఆనంద మయుడయి శ్రీ మల్లిఖార్జున స్వామి వారి వరపుత్రుడగు నట్టి మల్లిఖార్జున పండితారాధ్యులు అనే నామాంకితం యేర్పరచినారు అంతట దినదిన ప్రవర్థమానుడై సకల విద్యాపరిపూర్ణుడయి అఖండిత వీర శైవాగమాంత ప్రవీణుడయి అనుపమానుడయి ప్రసిద్ధి పొంది, తమ మతోద్ధారకుడయిన శ్రీ బసవేశ్వరుడనే మహాత్ముల దర్శనముచేసి తదనుజ్ఞ వడశి శ్రీశైల ప్రదక్షిణ నిమిత్తార్థమై వెళ్ళవలెనని ప్రయాణమయి అనేక శిష్యజన సంఘముతో వస్తూ చందవోలు వచ్చి శ్రీ పొండేశ్వరస్వామి యొక్క ముఖ మంట్టపములో ప్రవేశించ్చి యున్నంతలో సదరహి బుద్ధాంలో నివాసంగా యుండ్డే బిజ్జయుడు యీ మల్లిఖార్జున పండితారాధుల వారి విభవాతి శయములు చూచి బలాబలములు కనుక్కొనే నిమిత్తము ప్రసంగములు జరిగించినంద్ను అబిజ్జయుని యొక్క ప్రశ్నలు పూర్వపక్షముగా చేసి భౌద్ధమత ప్రభావములు ఖండన చేసి నంత్తల్లో పండితారాధ్యుల వారి శివపూజా ద్రవ్యములలో నిత్యా

నియమముగా వుండ్డే నక్షత్ర హారతి తన శిష్యుడి చేత తెప్పించి బుద్ధాం పంపిస్తూ వుండేవరకూ పండితారాధ్యుల వారి శిష్యుడు గురువు చేత మాట వచ్చునని విమర్శించి ఆ నక్షత్ర హారతి తీసుకు పొయ్యేవాణ్ణి కనుక్కొని వధచేశి, తిరిగి వచ్చినంత్తల్లో బౌద్ధ గురువు తన శిష్యులను పిలిచి మీరు పండితారాధ్యుల వారివద్దకు వెళ్ళి అక్రమముగా జీవహింస చేశిన వారికి విధి తెలుసుకొని తదనంత్తరం తెలియచేసి రమ్మనె గన్కు ఆ ప్రకారం వారు వెళ్ళి తెలుసుకొన్నంత్తల్లో యీ ప్రకారం చేయించ్చిన వారికి కండ్లు తోడించ్చడం విధి అని యేర్పరచె గన్కు యీ సంగ్గతి యావత్తు మీ వలనే జరిగినది అని విశదపరచి నంత్తలో ఆయ్న బహు కోపయుక్తుడయి బౌద్ధులు చేసిన కృత్రిమం అని తెలిశి ప్రభావం ప్రకటించవలయునని స్వయం కృతముగా తమ నేత్రములు తీసిరి గన్కు లింగ్గోద్భవస్వామి వారి అనుగ్రహం వల్లను కన్నులు తిరిగి రావడానకు సమాధానపడక ముప్పంద్దుం పరియంతము యీ ప్రకారంగ్గా కంన్నులు తోడి తదనంత్తరం అక్కడికి దక్షిణం రెండ్డు కోసుల దూరగల గోకర్ణేశ్వరం వెళ్లి శ్రీ గోకర్ణేశ్వర స్వామి వారి దర్శనము చేశ్నింత్తల్లో నిలువు కంన్నులుగా ప్రసాదించ్చినారు గన్కు పండితారాధ్యుల వారు శ్రీ స్వామివారి సన్నిధానమంద్ను వుండి యీ చందవోలులో శైవులకు శివపూజార్హత లేక పోదునిన్నీ యిక్కడ యీ బౌద్ధులు ఖిలమైపోదురనింన్నీ శాపం యిచ్చి శ్రీశైల ప్రదక్షిణార్థముగా వెళ్లినారు. అంత్తట యీ బుద్ధాంలో నివాసంగా యుండే జయినులు తశ్శాప విశేషం వల్ల దినే దినే ఖిలమై ఆ పట్ణం విచ్ఛిత్తం అయిపోయె గన్కు యిప్పుడు ఆ పట్నం గొప్ప దిబ్బగా యేర్పడి వుంన్నది. అందుల్లో యిప్పుడు యవరు అయినా తవ్వితే గొప్ప యిటికె రాళ్ళు వగయిరాలు బయలుదేరుతవి. అందులో జయినులు యొక్క శిలా ప్రతిమలు యొదలయినవి వుంన్నవి అని చెప్పుతారు. యిదివరకు అక్కడ కాపురముండ్డి విజయం పొందినవారు వేరు. అంతా పాడుగా వుంన్నది. యిది పూర్వము బౌద్ధులు కాపురం చేశ్ని పట్నం గన్కు బౌద్ధం అని నామం యిప్పటికింన్ని ప్రశిద్ధిగా వుంన్నది.

# చందవోలు కైఫీయత్తు

తదనంత్తరం తూపుర్వ దేశముల నుంచ్చి యీశ్వర వరప్రసాద జనితులయ్యినఘవంట్టి అఖండిత వీర శైవాచార వ్రతులయ్యినఘ వంట్టింన్ని వాసనకలోద్భవుడైన శ్రీ మల్లిఖార్జున పండ్డితారాధ్యుల వారు శ్రీశైల ప్రదక్షిణోత్సకుడై యీ మార్గాన చంద్దోవోలు వచ్చి శ్రీ పాండిశ్వర స్వామి వారి యొక్క ముఖ మంటపంలో వుండి వున్నందున్న శ్రీ మన్మహా మండ్డలేశ్వర కొండ్డ పడమటి బుద్ధరాజులుంగారి గుర్వు బౌద్ధ మతానుసరణ శాస్త్ర ప్రవీణుడై బుద్ధాం అనే గ్రామంలో నివాసం చేస్కుని యిక్కడి వుండ్డి వున్నాడు గన్కు మల్లిఖార్జున పండ్డితారాధ్యు వారి యొక్క బిరుదులు మొదలయ్యి పరిధవం చూచినంత ద్వేషం చాతను విరోధించ్చి పరాజయ పరచవలెనని ప్రసంగములు చేశ్నిందున యీశ్వరాంశ సంభూతుడు గనుక వారు యిచ్చిన ప్రశ్నలు పూర్వపక్షం చేశి జైన బౌద్ధ చార్వాక మతములు ఖండన చేసి పరాజయమును పొంద్దింప్ప చేశిరి తదనంత్తరం బౌద్ధులు మతగురువు పరాజయం విచారించ్చి పండితారాధ్యుల వారి శివపూజా నిష్టా గరిష్టతను చూచి తన్నిష్పుకు విఘ్నము చేయదలచి పండితారాధ్యుల వారు శివలింగ్గార్చన కాలమంద్దు నిత్యవ్రతంగా సమప్పించ్చే నక్షత్ర హారతి బెజ్జుడనే బౌద్ధుడు యామరించ్చి చోరత్వం చేతను తీసుకొని పోతూ వుండగా పండితారాధ్యుల వారి శిష్యుల్కు తెలిసి చందవోలుకు పశ్చిమ మార్గంగ్గా వెళ్ళుతూ వున్న బెజ్జుంణ్ని కనుక్కుని అత్యంత్త కోపం చేసి గురు ద్రవ్యం హరించ్చినందున వాణ్ని వధచేసి, ఆ నక్షత్ర హారతి తీస్కుని వచ్చి గురువుకు తెలియకుండా శివపూజా ద్రవ్యములో వుంచ్చినాడు. అటు పిమ్మట బౌద్ధులు కొందరు పండ్డితారాధ్యుల దగ్గిరకు వెళ్ళి అక్రమంగా జీవహింస చేశ్ని వారికి శాస్త్రోక్త ప్రకారంగ్గా చేయ తగ్గ ప్రాయశ్చితముకు విధియేమో మా గురువు మింమ్మున అడిగి రంమ్మంన్నాడని చెప్పెనంత్తల్లో యీ గంట్టి పని చేయించిన వారికి కంన్నులు తోడించ్చుడం విధి యని చెప్పె గనుక బౌద్ధులు యీ అక్రమం మీవల్లనే జర్గినది అని తెలియచేసిరి గనుక పండ్డితారాధ్యుల వారు దివ్యజ్ఞానం వల్ల విచారించ్చి యింద్కు ప్రతిహతం విచారిస్తిమా అసత్యం పల్కినవారు మవుతాము యిది బౌద్ధవులు చేశ్ని కృత్యముగదా అనీ తెలిశి స్నానసంధ్యాధ్యను నష్టానముతోను సరణశాస్త్రోక్త శివపూజా క్రియలు జర్పుకుని

లింగ్గోద్భవ స్వామి వారి యదుట కూర్చుండి సంధ్యాశివుని యంద్దే భక్తి వుంచ్చి యీశ్వరుడికి తన నేత్రములు అర్పించ్చే కొరకు స్వయంకృతముగానే తమ యొక్క నేత్రములు తీశి లింగ్గోద్భవుని ముంద్ధరపెట్టిన తర్వాత అతని భక్తి విశేషం వల్ల ఆ భక్తునికి తిర్గికంన్నులు ప్రసాదిస్తూ వచ్చి నంత్తల్లో తన ప్రభావం ప్రకటన చేసే కొరకు తిరిగి కంన్నులు తోడుతూ వచ్చినారు. యీ ప్రకారంగా ముప్పై ఐదు పరియంత్తరం కంన్నులు తోడి అంత్తట పండితారాధ్యుల వారు బౌద్ధులు యీ ప్రకారమంగా విష పరీక్ష చేశ్నింద్కు కోపం వచ్చి యంత్తట నుంచ్చి యీ చందవోలులో లింగధారులైన వారు శివపూజ చయ్యేడాన్కు అర్హత లేక పోననింన్ని యీ బౌద్ధుల్కు యీ స్తలంలో జయం లేకపోదురనింన్ని శాపం యిచ్చి అక్కడి నుంచ్చి లేచి ఆ గ్రామానకు దక్షిణ భాగమంద్ధు వుంన్నఘ వంట్టి మహ ప్రభావం గల గోకన్నేశ్వరం వెళ్ళి శివసాన్నిధ్యమందు వుంన్న సమయుమన గోకన్నేశ్వర స్వామి వారు పండితారాధ్యుల వారి యందు కరుణించ్చి నిలువు కంన్నులుగా దయ చేసినారు. అక్కడి నుంచ్చి శ్రీశైల ప్రదక్షిణ నిమిత్యార్ధము వెళ్ళినారు. యీ హెతువునుంచ్చి వచ్చిన శాపంవల్లను బౌద్ధులు దినేదినే అపజయులై ఖిలమయిపోయిరి.

బుద్ధాం కైఫీయత్తు బట్టి మల్లిఖార్జునుని తండ్రి అతని జననమునకు పూర్వము ఇచ్చటి బ్రాహ్మణులచే అవమానించబడెనని శ్రీశైల మల్లిఖార్జునస్వామి వారి వరప్రసాదిగ మల్లిఖార్జున పండితారాధ్యుడు జన్మించెనని తెలియుచున్నది. బౌద్ధ, జైనములను నాశనముచేసి వీరశైవమును ప్రతిష్ఠించుటకు ప్రయత్నించెను. ఈతని శిష్యవర్గము అనేక జైన సదులను, జైన గ్రామములను నామరూపములు లేకుండా జేసెను. ఈతని మతప్రచారము ఒక జైత్రయాత్రవలె సాగెను. వెలనాడులో కాలుమోపిన వద్ద నుండి చందోలు పరిసర ప్రాంత జైన సనదులు అల్లకల్లోలమాయెను.

శ్రీపతిపండితుడు 1060 ప్రాంతమున మల్లిఖార్జున పండితుడు 1160 ప్రాంతమున శివలింకమంచెన 13వ శతాబ్దమున శైవమత స్థాపన కొరకు పాటుబడి పండితత్రయముగా చరిత్రలో నిల్చిరి.

వర్ధమానుడు, గౌతముడు అహింసా సిద్ధాంత లోతులను తరచి చూచారు. సంఘ పరిస్థితులకు అన్వయించి వారి సిద్ధాంతములు నిలద్రొక్కుకొనుటకు చేసిన ప్రయత్నములు - తదుపరి మండన మిశ్ర, ఆదిశంకర వంటి వారి ధాటికి అవి నిలువలేక పోవుట, రాజ్యవిస్తరణతో మతవ్యాప్తి విలీనమయి రాజు - మతబోధకుడు సర్వాధికారములుతో గూడిన వారి భావనలు సంఘముపై రుద్దుట - రాజు రాజ్యమును సుస్థిర పరచుకొని తనవారసులకు ఇవ్వవలెనని మతాచార్యుడు తన ఆశయములతో గూడిన - తన మతమొక్కటే నిలువలెనని -- ఇది యే 1000 సం॥ముల చరిత్ర.

## 21. కరణీకపు వ్యవస్థ - ఆఱువేల వెలనాడు

కంకంటి పాపరాజు రచించిన ఉత్తర రామాయణ పీఠికలో నాః వారి ప్రతిభ నిట్లభివర్ణించెను.

సీ. అఖిల రాజాధి రాజాస్థాన జనహృద్య
విద్యావిహారు లార్వేల వారు
కల్పకబలికర్ణ కలశార్ణ తోదీర్ణ
వితరణోదారు లార్వేల వారు
సజ్జన స్తవనీయ సతత నిర్వ్యాజహారి
పరోపకారు లార్వేలవారు
ఘనదుర్ఘట స్వామి కార్యనిర్వహణ ప్ర
వీణతాధారు లార్వేల వారు
తే. విమతగర్వాపహారు లార్వేలవారు

నాటికి నేటికినీ యూత్వేలనాటి నియోగ బ్రాహ్మణులు కవన,కదన కార్యనిర్వహణములందు కీర్తి గాంచినవారు.

## 22. నూతన కరణీకపు వ్యవస్థ - ఆవిర్భావము

గజపతి సింహాసనస్థుడయ్యి గణపతి మహారాజులుంగారు క్రీ.శ. 1134 లగాయితు రాజ్యం చేసేటప్పుడు వీరి దగ్గర మహాప్రధానులయ్యి గోపరాజురామన్న

గారు ప్రభువు దగ్గర దానం పట్టి సమస్తమయ్ని నియోగులకు క్రీ.శ. 1145 అగు రక్తాక్షి నామ సం॥ర భాద్రపద బహుళ 30 అంగార్కవారం సూర్యగ్రహణ కాలమందు గాను కరణపుమిరాశిసన్నదులు వ్రాసి ఇచ్చే యడల  గుంటూరు కైఫీయత్తు ననుసరించి కొన్ని

(1) యలవర్రుగుంట ప్రథములు భరద్వాజగోత్రుల సంప్రతి.

(2) బండారుపల్లి ప్రథములు భరద్వాజ గోత్రుల సంప్రతి వీరిని గోవాడ వారందురు

(3) తూర్పుగరికెపాడు ప్రథములు భరద్వాజ గోత్రులు సంప్రతి వీరిని గోవాడ వారందురు

(4) దగ్గుబల్లి వెలనాడు వసిష్టగోత్రుల సంప్రతి. ఖండవీలు గోవాడ నందవరీకుల సంప్రతి -1. కాశ్యపగోత్రుల సంప్రతి - 1.

(5) యలవర్రు ప్రథములు. కౌశిక గోత్రుల సంప్రతి

పై వానిని బట్టి గోవాడ వారలు కరణీకపుమిరాశిగా ఇతర గ్రామాదులకు చేరినట్లు కొన్ని గ్రామాదులకు కలపి ఒక్కరినే మరియు ఒక్క గ్రామమునకే ఇరువురు లేక ముగ్గురును వేయుట జరిగినదని తెలియునగును. భూవిస్తీర్ణము - ఆదాయము ప్రాతిపదికగా మిరాశీలు కొన్ని జరిగినటుల గూడా తెలియుచున్నది. (ఈ కరణీకపుమిరాశీలు ఇచ్చుటకు ముందు వెలనాటిలో అరవలు కరణీకపెత్తనము చెలాయించెడివారు. చోళసామ్రాజ్యం, తూర్పు చాళుక్య, వెలనాడుల పతనానంతరము వారల తొలిగించి ఆరువేల కరణీకమిరాశీలు ఇచ్చిరని ఇది ఆనాటి సంఘ సంస్కరణలలో భాగమని తెలియగలదు).

ఈ కరణీకపుమిరాశీలు వ్రాసి యిచ్చు నాటికి అనగా క్రీ.శ. 1145 నాటికి దగ్గుబల్లి, గోవాడలకు దగ్గుబల్లికి వెలనాడు వశిష్టగోత్రుల సంప్రతి. మరియు గోవాడకు నందవరీకుల సంప్రతి - 1. కాశ్యప గోత్రుల సంప్రతి - 1. వెరశి రెండు ఆయకట్టులకు కలపి 3 సంప్రతులు మిరాశీయివ్వబడెను.

# 23. చావలి - కరాబ్

శ్రీ పొణుకుమాటి వెంకట సుబ్బయ్య గారి రచన " కొల్లూరు కథనం " మేరకు తెనాలి రెవిన్యూ మండలములో అయిదు కథనాలు వినవస్తాయి. అవి. (1) భట్టిప్రోలు పంచాయితీ, (2) చావలి కరాబ్ (3) మందూరు అంబోతు, (4) పెదరావూరు ఖాతా, (5) కొల్లూరు పీడ - క్రాపమీదగా పోయింది. క్రీ.శ. 1145 లో గణపతిదేవ చక్రవర్తి అరవల నుండి కరణపు ఉద్యోగములను లాగుకొని ఆరువేల నియోగులను నియమించుట ద్వారా తీసుకొచ్చిన సంఘ మార్పును మొదట చావలి గ్రామమునందు కరాబు గావించబడుటచేతను - చావలి కరాబు చరిత్రలో నిలిచెను.

ఇచ్చట గమనించదగిన రాజకీయ రాజ్య చరిత్ర ఒకపరి చూడవలెను.

1) 1136 నుండి 1161 వరకు వెలనాటి చందోలును పాలించిన వెలనాటి గొంకరాజు కాకతీయ రాజులలో 1115 నుండి 1158 వరకు పాలించిన కాకతీయ 2వ ప్రోలరాజు దండెత్తి రాగా వీర రాజేంద్రచోళుడు, కోటచోడయరాజులతో కలసి కాకతి ప్రోలరాజును వధించిరి.

2) తదుపరి రుద్రదేవుడు మొదటి ప్రతాపరుద్రుడు (వీరి తండ్రి కాకతిప్రోలరాజు) 1180 ప్రాంతమున వెలనాటిపై దండెత్తి కాలచుర్య, వేంగి, చాళుక్య, పాకనాటి చోడులసాయమున వెలనాటి గొంకరాజు-II కుమారుడైన వెలనాటి రెండవ రాజేంద్రచోడరాజును వధించి చందోలును దగ్ధమొనర్చి - తండ్రి వధకు ఋణమును తీర్చుకొనెను.

3) వెలనాటి గొంకరాజు-III కుమార్డు పృధ్వీశ్వరుడు 1186-1211 వెలనాటిని పాలించెను. పిఠాపురము రాజధానిగా చేసుకొని బలపడిన పిమ్మట 1203 లో వెలనాటి రాజధానియగు చందోలును తిరిగి స్వాధీనపరచుకోగలిగెను.

4) గణపతిదేవ చక్రవర్తి ఇతనిపై 1201లో దండయాత్రకు రాగా వెనుకకు పారద్రోలెను. 1211లో ఇమ్మడి రాజాధిరాజ చోళునకు సాయమొనర్చుచు నెల్లూరు చోడతిక్కనతో యుద్ధమొనర్చి యందు హతుడయ్యెను. ఈతని

మరణానంతరము గణపతి దేవ చక్రవర్తి తిరిగి 1212-14 మధ్య వెలనాడాక్రమించెను.

5) ధరణికోట రాజులలో 2వ భీమరాజు పల్నాటి యుద్ధములో నలగామ రాజునకు సాయంపడ ఈయన కుమారుడు 2వ కేతరాజు సంధిరాయభారమొనర్చెను. వెలనాటి గొంకరాజు-II తోబుట్టువ - సుబ్బాంబికను ఈ కేతరాజు-II వివాహమాడెను. ఈతని తరువాత 1160-1175 మధ్య కోటరెండవ గండరాజు తరువాత 2వ బేతరాజును పాలించిరి.

6) కాకతీయరాజ్యము 1323 వరకు నిలబడుటచే మధ్యకాలమున కరణీకపు మిరాశీ వ్యవస్థను మార్చి నూతన లేక సనాతన వ్యవస్థను పునరుద్ధరించు వారు లేకుండిరి.

7) ఆంధ్రదేశంలో పాల్కురికి సోమన 1160-1240 మధ్య జీవించి 1192లో బసవపురాణమును, 1222లో పండితారాధ్య చరిత్రని వ్రాసెను. అంతకుముందే 1168లో బసవపురాణ బసవేశ్వరుడు 1170లో పండితారాధ్య మల్లిఖార్జున పండితారాధ్యుడు శివైక్యంచెందేరు.

## 24. సదాశివరాయల - అగ్రహారదానము

చోళ, చాళుక్య చోడ, వెలనాడు, కాకతి రాజ్యాల పతనానంతరం కర్నాటక ప్రభువుగా శ్రీ సదాశివ దేవరాయలు ప్రజాపరిపాలన చేయునపుడు..

## గుంటూరు కైఫీయతు

శ్లో:- చిల్కరులకులేజాతాం వల్లభాచార్య

దేశ సంప్రతి సదాశివరాయ పురందదౌ !

“స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వత్సరంబులు ౧౪౬౦ (1533 క్రీ.శ.) అగునేటి క్రోధినామ సంవత్సరమందునను చిల్కమర్తి వల్లభాచార్యులు గార్కి చినకూరపాడు అగ్రహారం యిచ్చెను. సదాశివరాయదత్తి

గోవాడ అగ్రహారం శవర్తుగతి భూసంఖ్యే శాకాబ్దేశాలివాహనే శ్రీసదాశివరాయేంద్రో; శోభకృన్నామచత్సతే, వల్లభాచార్య విఖ్యాయా చిలకమర్తి కువాయవై ధర్మ సంస్థాపనార్థాయదదౌ గోసానికాపురే స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౬౫ (1543 క్రీ.శ.) అగునేటి శోభకృతునామ సంవ్వత్సర మందు నను గోవాడ యిచ్చెను. అకుమర్లపూడి సప్తషష్ఠాభి భూసంఖే శాలివాహనే శ్రీసదాశివరాయే ద్రావిశ్వరుకు శరద్వజవల్లభాచార్యమర్యాయ చిలుకమర్తికులాయచ యీశ్వరార్పణ బుధ్యా వైహనుమర్లపురందదౌ, స్వస్థిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౬౭ (1545 క్రీ.శ.) అగు నేటి విశ్వానునామ సంవత్సరమందునను అనువర్లపూడి యిచ్చెను."

పై కైఫియతులోని విషయమునుబట్టి చిలకమర్తి వల్లభాచార్య అను వ్యక్తికి గోసానికాపురమను గోవాడను ధర్మసంస్థాపనార్థము సదాశివదేవరాయలు దానశాసనమిచ్చెనని తెలియుచున్నది.

## 25. సదాశివరాయల తామ్రశాసనము

ప్రజోత్పత్తినామ సంవత్సరము వైశాఖ బ ౧౨ సోమవారము ది.౨౦ మెయి ఆన ౧౮౧౧ సంవత్సరము.

గోవాడలో అగ్రహారీకుల వద్ద వున్న తామ్రశాసనమునకు నకలు.

శ్రీ విరూపాక్ష :............. పరమేశ్వరహః

శ్లో॥ మూరురాయనగండ యోక్యే మేరూలంఘ్య యశోభరః ।
శరణాగత మందారః పరరాజభయంకరః ॥

శ్లో॥ కనర్ణాటరభూపాలః పతురదారపహాచౌవకః ।
పాండ్యరాయ సురత్రాణః శింధూరోజగతీపతిః ॥

శ్లో॥ విష్టపత్రయ విఖ్యాతః దుష్టశార్దూల మర్దనః ।
హరీణాంగండ బేరుండః హరిభక్తిసుధానిధిః ॥

శ్లో॥ వర్ధమానవదౌ శ్రీవర్ధితారదేశ్వరహః ।
ఇత్యాది బిరుదైర్వందిత తత్తధాత్రీ తత్సరః ॥

శ్లో॥ కాంభోజ భోజ కాళింగయరపోటాది పార్థివైః ।
సేవితాత్మపదోపేతః సందర్శితనృపాస్పదహః ॥

శ్లో॥ సోఽయంవీశారదస్సరతో ద్వరదాయ విశ్వాపకృః ।
సర్వోర్వీశవతస్స సాదాశివమహారాయక్ష మానాయకః ॥
బాహ్వాసాది అనిర్విశేష మఖిలాండర్వపహావరుద్వహా విద్యత్రాణపరాయణోవిదయతే.
వీరప్రతాపోనృపః ॥

శ్లో॥ రసాగార్నవశీతాంశుగణితే శకవస్సరే ।
క్రోది సంవత్సరే పౌష్యమాసే మార్తాండవారే ॥

శ్లో॥ పక్షేవళక్షేపుణ్యాహోపూర్ణి మాయాంమహాతిథౌ ।
తుంగభద్రానదీ తీరేవిరలేశ్వరసన్నిధౌః ॥

శ్లో॥ కాశ్యపాన్యయవారాశి కల్పభూజ ప్రభాత్మనే ।
అభీష్టదాయినేతస్మై భక్తానాం మోక్షదాయినే ॥

శ్లో॥ షట్కర్మసంతతోపాత్త వర్మణేవేదకర్మణే ।
షడ్గుణ శ్రీకమలినీ సముల్లాస వివస్వతే ॥

శ్లో॥ నిగ మాగమ సంఘాత నిర్జరాధీశ మంత్రిణ ।
వైష్ణవాగమతత్వార్థ వాగ్వధూతృప్తి శాలినే ॥

శ్లో. వేదాంతాచార్య వర్యాయ విదుషామగ్రయాయినే ।
విదుషాశేఖ వేదాంత ప్రతిష్ఠాచార్య మౌళయే ॥

శ్లో. మహాశ్రీభాష్యసద సేమణిదీ పితబుద్ధయే।
మహీశ్వరకటీరత్న మహితాంఘ్రిసరోరుహః॥

శ్లో. పురాణపురుషాధాన పుణ్యోజ్జ్వలిత మూర్తయే।
శ్రుతిస్మృతిపురాణార్థసూచికాశౌ చవృత్తయే॥

శ్లో. సాగరఃకరుణావార్ధేః సౌగంధికరసోక్తయే।
పదవాక్యప్రమాణాభ్యాంసారస్వక్సారదృశ్వనే॥

శ్లో. ఇందిరాజనిమందారమాలాశిష్యాయధీమతే।
రాజితాననపద్మాయవాచాదేవతయాత్మనే॥

శ్లో. వల్లభాచార్యవర్యాయవిచిత్రాంతరవైరిణే।
శ్రీకొండవీటి శీమాంత దుర్గపాలస్థితిష్ణవే॥

శ్లో. విఖ్యాతమతికాంప్రాప్తంవెలనాటినివాసినే।
యనపర్తి మహాగ్రామప్రాచీనానాముపాశ్రితం॥

శ్లో. గ్రామాదమృతలూరుశ్చదాతా చాగ్నేయతోమితం।
గ్రామాదమృతలూరుశ్చదక్షిణస్యాందిశిస్థితం॥

శ్లో. పాచాలవరక్రామాశ్చనైరుతీందిశమాశ్రితా:।
గ్రామాన్నడినిపల్ల్యాఖ్యాదాశ్రితం ప్కశ్చిమాందిశం॥

శ్లో. పొన్నపల్ల్యాహ్వయగ్రామాత్సంప్రాప్యంవాయవీందిశం।
గుళ్లపల్లిశ్చరుకు వల్లిచోభావపిదిశోత్తరం॥

శ్లో. క్షేత్రాదింటూరుకావ్యా రిద్విగ్రామావీశదిక్స్రితౌ।
శ్రీభాష్యపురమిత్యేవప్రతినామాస్రితం॥

శ్లో. దగ్గుపల్ల్యాభిధానేనద్రామంగ్రామేనసంయుతం।
గ్రామంగోవాడనామానం అపితస్యోపశింతిత:॥

శ్లో. శ్రీకేతవరసీమాంతర్వాతం భూసుర భూషితం।
ముప్పాళ్లగ్రామధాత్రీచ ఆగ్నేయంకూడలాభిధ:॥

శ్లో. పల్లీదేవరపాలాఖ్యంగ్రామస్యాపిమహిమను:।
క్షేత్రాన్నావనిపాదాఖ్యం నైరుతెదిశమాశ్రితం॥

శ్లో. గ్రామాన్నావనిపాదాఖ్యంపశ్చిమాయాందిశిస్థితం।
పోలంకువాడునామాపి వాయవ్యం గ్రామకాద్వరాత్।
గొండుపాడురితిఖ్యాతోగ్రామకారిడిచోత్తదం॥
గ్రామికాద్గార్ల పల్లీచయిాశానీ మాశ్రితందిశం।
లంకెలాకూరపాడుశ్చగ్రామంచాపి మనోహరం।
సర్వమాన్యంచతుశ్శీమాసంయుతస్యసముద్ధత:।
నిధినిక్షేపపాషాణ సిద్ధసాధ్య జలాన్వితం॥
అక్షీణగ్రామసంయుక్తం ఎకభోగం సమారుహం॥

శ్లో. విపీకూపతటాకైశ్చ పర్వేణాపిసమన్వితం।

పుత్రపౌత్రాదిభిర్భాగ్యంక్రమాదిచంద్రతాకరకం॥

శ్లో. జ్ఞానస్యదమిసస్యాపి భాషితా:మహోషోపమా:।
నానాలర్ణాశ్రీమాలింగా స్థాపితాపాలితాశ్చయే॥

బిరుదురారాహంత వైశ్యకభాజితవివిధ భద్రితస్య విఖ్యాత బిరుదమనీష మావివారలీలస్య విజయ శీలస్య కర్ణాటక రాజ్యలక్ష్మీస్థాపనబిరిదస్య ద్విభువనస్య సమోస్త్వంగుళయే -------

శ్లో. స్వాంతేశబళితాత్యంతల హరిభక్తిసుధానిధి:
ఆత్రేయగోత్రాధిపస్య మూర్తేరివ మనోభువ:॥
సోమవంశావతం సస్యమహితస్యాతితేజస:।
స్వాధీనవీరమార్గస్యనూర్యాలంబికలాతతే:॥
ధర్మమర్మవిధస్థానకర్మణో స్యమనీషిణ:।
ధ్వర్మాతారిమహీపాలతర్మహరిమహోజస:॥
శ్రీరంగారాయపూర్వత్తస్థిరపుణ్యఫలాత్మన:।
పీరస్యరామరాజస్యవిజ్ఞప్తి మనుపాలయః॥
ఫలితప్రత్నసిద్ధైశ్చ పురోహితపురోగమై:।
వివిధైర్విబుధశ్రౌతఫలితౌరంజితైత్తిరా॥
సదాశివమహారాయో మాననీయోమనస్వినాం।
సహిరణ్యందానధారా పూర్వకందత్తవాన్ముదా॥
గ్రామస్యాస్యతు శీమాన:దిక్షుప్రరిమక్రమాత్।
తత్రబ్రహ్మసమాయుక్తా: ఆఖ్యాతాహితభాషిణ:॥

గోవాడ దగ్గుపల్లిరెంచికి ప్రతినామంఅయిన శ్రీభాష్యం పొలిమేర చిహ్నాములు --

తూర్పుకు నడిమిపల్లిచవిటిగుంట, చనుగుంట. ఆగ్నేయానకు మల్లమచెరువు, దక్షిణానకు గుళ్లపల్లి చర్కుమల్లిపొలిమేర, నైరుతీ మూలకు కావూరు పొలిమేర, కూడలికి తాడి సంటు ఇంటూరు పొలిమేరకు గంగయకాలువ పడమటికి యలమర్తి పొలిమేర కందలి వాదవాని కరణక్కెరకాలువ,

వాయువ్యానకు అమృతలూరుపొలిమేరను అత్తిమానుగుంట, వుత్తరాన అయూతలూరి పొలిమేకను నక్కలతిప్ప, పోతనిగుంట. పిచ్చగల పాటి మీదను పులి చింతలగుంట ; సరువుగుంట ఇది అష్ట దిక్కులలో పొలిమేరచిహ్నాములు.

లంకెలకూరపాడు అనే గ్రామమునకు పొలిమేరచిహ్నాములు. వూరికి తూర్పున నార్యపాడు, కూరపాడు నడిమి పొలిమేరను తమిరిగుంట.

ఆగ్నేయానకు పాలంకుపాడు, దొండపాడు సందు దరలమిట్ట, దక్షిణపు భాగమందు దొండపాడు, కూరపాడు నుడమ పొలిమేరకున పతుగుగుండ్ల నైఋతికి నరగొడ్లపాడు ముప్పాళ్ళ పొలం కూడలి పొలిమేరను గొరంగిమెట్ట వూరికి పశ్చిమాన ముప్పాళ్ళ మాదల పొలనాకూడిన బొల్లవరానకు బోయిన తెరవన ఆరువర్వు ; ఆ తూర్పున యల్లారెడ్డి గుంట, వూరికి వుత్తరాన దేవరపాడు, కూరపాటికి పొలిమేరను చానప్పకుంటవడికివాస, ఈశాన్యమునకు నార్యపాటిపల్లి, దేవనపాటి పొలానకు తిర్గినర్రపుట్టు - ఇది అష్టదిక్కుపొలిమేర చిహ్నాములు.

శ్లో॥ సరస సదాశివరాయక్షితివర్యస్య కీర్తి తవ్య గుణదాశరథేః ।
అమితహోమదానరతేః మృదుపదమిత తామ్ర శాసనార్థమ్॥

శ్లో॥ సరస సదాశివరాయ శాసనే కరుణా భరణా వచో మహిమ్నా।
సరసాదారీణ భారతీ స్వయంభూః సదాశివదేవ మహారాయోజయతే॥

శ్లో॥ సదాశివమాహారాయ శాసనార్థీ్వరణాత్మజః ।
తదాశ్రిత వరాచార్యాల్లిఖ్యతే తామ్రశాశనః ॥

శ్లో॥ దానపాలన యోర్మధ్యేదానాచ్ఛ్రే యోనుపాలనం ।
దానాత్స్వర్గమ వాప్నోతి పాలనాదద్యుతంపదం ॥

శ్లో॥ స్వదత్తాద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం ।
స్వదత్తాం పరదత్తాం వాయో హరేత వసుంధరాం ॥
షష్టిర్వర్ష సహస్రాణి విష్టా యాంజా యతే క్రిమిః ॥
ఏకైవ భగినీలోకే సర్వేషామే వభుభుజాం ।
నభోజ్యానకరగ్రా హ్యావి ప్రదత్తా వసుంధరా ॥
సామాన్యోయం ధర్మశేతుర్నృపాణాం
కాలేకాలే పాలనీ యోభవధ్భిః ॥

గోవాడ - ఇది తెనాలి సమీపమున గలదు. ఇది అగ్రహారమగుటచే నగ్రహారీకులవద్ద దొరకిన శాసనము.

తామ్రశాసనము :- శా-శ- ౧౪౭౩ లో సర్వప్రశస్త బిరుదాంకితుడగు సదాశివదేవరాయులు ఆంధ్రదేశమును పాలించుచుండగా ఆయన తుంగభద్రానదీ సమీప విఠలేశ్వరుసన్నిధిలో కాశ్యపగోత్రీకుడును, వేదశాస్త్ర సంపన్నుడు, సత్కర్మాచరణుడును, వైష్ణవాగమవవేత్తయు, వేదాంత్యాచార్యులును, శ్రీభాష్యమును సమగ్రము గఁదెలిసినవాడును, శ్రుతిస్మృతి పురాణవేత్తయును,పదవాక్య ప్రమాణజ్ఞుడు, ప్రశస్తవాగ్దేవతా చార్యుడునగు వల్భఆచార్యుల వారికి శ్రీ భాష్యపురము మొసఁగెను.

(శ్రీ భాష్యపురమునకు నామాంతరము - గోవాడ- దగ్గపల్లి అనుగ్రామద్వయము)

దీని కష్టదిక్కుల గ్రామములు : తూర్పున అనపర్తియు, ఆగ్నేయమున నమృతలూరును, దక్షిణమున పాంచాలవరము, నైరుతిని నడిమి పల్లియు, పడమర పొన్నపల్లి, వాయువ్యమున గుళ్లపల్లి, చెరుకుపల్లియనునవియు, ఉత్తరమున ఇంటూరు, ఈశాన్యమున కావూరు అను గ్రామములు గలవు. కేతవరగ్రామము వఱకు దీని సరిహద్దు. ఇది దగ్గుపల్లి గుర్తు. ఇట్లే గోవాఢ గ్రామమునకు గూడ గుర్తులు - ముప్పాళ్ళ, కూడలి, దేవరపల్లి, అన్నవరము, పొలంకుపాడు, గొండుపాడు, కారిడి, గార్లపల్లి అనునవి అష్టదిక్కులగుర్తులు - శ్రీ భాష్యపట్టణమును - నిధినిక్షేపాదులతో గూడిన హక్కుచు, సర్వతో ముఖమున సమర్పించెను. మరియు కొందరు బ్రాహ్మణులకు అగ్రహారముల దానమును శ్రీసదా శివదేవరాయలు స్వయముగ చేసెను. ఇంకను ఈ గ్రామములకు గల చిహ్నములు వగైరాలు తెలుగులో వ్రాయబడియున్నది.

సదాశివరాయల దానశాసనమున వ్రాయబడిన గోవాడ హద్దులలో గోవాడకు - పడమటిని "యలమర్తి పొలిమేర కందలి వాదవానికరణెక్కర కాలువ" - వాద - దానికర - నక్కేరు కాలువగా భావించవచ్చని పెద్దల భావన. వాదలోనికి చిన్నవాగు (నక్కేరు) రాకసూచనను తెలుపుచున్నది.

# 26. ఇతర దాన పత్రికలు

## (1) యతమతరావు చిన వెంకన్న

2. శా-శ- ౧౬౧౬లో ఉభయవేదాంత ప్రవర్తక చిలకమర్రి వేంకటాచార్యుల వారికి యతమతరావు చినవేంకన్నగారు.కొంతభూమిని దానమును జేసిరి. దాని వివరములు విభాగములును దీని నాచంద్రార్క స్థాయిగా ననుభవింతురు గాక !

శాసనములు అర్థము :- స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వరుషంబులు ౧౬౧౬ అగు నేటి విరోధినామ సంవత్సరము వైశాఖ శుద్ధ ౧౦ సోమవారము నాడు శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయ వేదంత్త పువర్తకులైన చిలకమర్రి వేకంటాచార్యుల గారికి యత మతరావు చిన వెంకన్న గారు వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మశాసన పత్రికె - మా మెఖాసా గ్రామం గోవాడలో వూరికి దక్షిణమున కీబులు కబులు మూడు  కుచ్చళ్ళ పొలమున్ను మునుపటి శాసనాల దానిని గ్రామందరోబస్తుకయిలు అయిన పుట్లకు పుట్టి ౧కి రెండు మానెకెల చొప్పున దానిని మామూలుగా నడిపించిరి. గనుక మేమున్ను అప్రకారముగా శలవు యిచ్చినాము.

మీరు గ్రామమునకు యజమానులు గనుక పొలం ఫలపరుచుకొని అందులవండిన వంటనున్ను మీ వుత్ర పౌత్రపారంర్వ్యంగాను ఆచంద్రార్కస్తాయగాను అనుభవిస్తూ సుఖముగా వుండుకొనేది.

శ్లో. స్వదత్తాద్ద్వి గుణంపుణ్యంపరదత్తానుపాలనం

పరదత్తాపహారేణ స్వదత్తం నినిష్ఫలంభవేత్

ఏకైవభగినీలోకే . . . . . . .

## (2) మాణిక్యరావు రఘుపతిరాయనింగారు

3. శా-శ- ౧౭౫౫లో చిలకమర్రి వేంకటాచార్యుల వారికి మాణిక్యారావు రఘుపతిరావు గారు భూదానమును జేసిరి. అది యెచట నుండెడిది? ఎంత అని వ్రాయబడి యున్నది.

స్వస్తిశ్రీ విజయాభ్యదయశాలివాహన శకవరుషంబులు ౧౬౭౭ 1755 అగునేటి

చాంద్రమానయువనామ సంవత్సరము మార్గశిర బ ౨ శనివారము శ్రీ మద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయం వేదాంత్రప్రవర్తకులైన చిలకమర్రి వెకంటరమణానుజాచార్యులు అయ్యవార్లం గారికి మానిక్యావురరావు రఘుపతిరాయనిం గారికి వ్రాయించి యిచ్చిన భూదానపత్రికెయు గోవాడ సముతు పొన్నూరులోను అరకుచ్చలపొలం చెప్పినాము. ఫలపరచుకొని మీపుత్ర పౌత్రపారంపర్యంగాను ఆచంద్రార్కసాయిగాను అనుభవిస్తూ వచ్చేది.

శ్లో. స్వదత్తాద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం
పరదత్తాపహారేణస్వదత్తం నిష్ఫలంభవేత్

పై 3 శాసనములలలో మొదటిది క్రీ.శ. 1551 లో చిలకమర్తి వల్లభాచార్యుల వారికి సదాశివరాయల చేయివ్వబడినది. గోవాడ - దగ్గుమిల్లి రెండు గ్రామములను కలిపి ఏక గ్రామముగా చేసి శ్రీ భాష్యపురమని నామము చేసి వల్లభాచార్యుల వారికి గ్రామదానము చేసెను. వల్లభాచార్యులు వారు వైష్ణవాగమవేత్తయు, శ్రీ భాష్యయును సమగ్రముగ తెలిసిన వాడు అనుటనుబట్టి ఈ గ్రామదానము వెనుక ఇచ్చుట ఈ గ్రామము వైష్ణవసాంప్రదాయకూడలిగ చేయు ఉద్దేశ్యముననే వారిని ఇచ్చుటకు పంపుట జరిదినది. తదుపరి కొద్దికాలముననే సదాశివరాయలు చనిపోవుట జరిగినది.

2వ శాసనము క్రీ శ. 1694 లో చిలకమర్తి వేంకటాచార్యులు వారికి యతమతరావు వెంకన్నగారు దానశాశనముగా కొంత భూమిని వ్రాసినది. 1వ, 2వ శాసనముల మధ్య 143 సం॥ముల వ్యవధి యున్నది.

3వ శాసనము క్రీ.శ. 1833లో (చిలకమర్తి వెంకటాచార్యులు వారికి అచ్చుతప్పు) వెంకటరామానుజాచార్యులు గారు గారికి మాణిక్యరావు రఘుపతిరావు గారు భూదానము చేసినది. ఇందు సం॥ము అచ్చు తప్పు జరిగినది. క్రీ.శ. 1755 గా భావించవలెను. కారణము రాచూరు జమీ 1833 కి పూర్వము 1802 లో బ్రిటీషు వారిచే వేలం వేయబడగా నర్సరావు పేట జమీందారులచే కొనబడెను. సమస్తహక్కులతో.

మొదటి శాసనము తదుపరి దగ్గుమిల్లి గోవాడ సమేతుగా గుర్తించబడినది. కరణపు మిరాశీలలో మార్పులు జేరి ఒకేకరణము క్రిందకు వచ్చినది.

# 27. దగ్గుమిల్లి శిధిలాలు - పునరభివృద్ధి

శిధిల దగ్గుమిల్లిలో అనాది నుండి నేటివరకు ఉండి అవసర సందర్భములలో పూజలందుకొను దేశమ్మ నేటికిని అచ్చట శిధిల


దేశమ్మశిల

రూనములో యుండ ఇంకనూ అట వీరాంజనేయ, వరసిద్ధి వినాయక, శివలింగములు గ్రామము వోడువారినను అవి అచ్చటనే యున్నవి. కైఫీయత్తును బట్టి శ్రీరాముల వారి ఆలయం, శ్రీ సోమేశ్వ రస్వామి ఆలయం అని ఉదహరించినందున ఆంజనేయ విగ్రహము శ్రీరాములు వారి ఆలయముకు చెందినది గాను వినాయక విగ్రహము సోమేశ్వర ఆలయంనకు చెందినదిగా భావించనగును.

ఇవి చింతామణిశిలతో


శ్రీ వీరాంజనేయు

చెక్కబడినవి. ప్రస్తుతం ఈరెండును భిన్నములైన విగ్రహములు అయి వున్నవి. సోమేశ్వర శివలింగము పానుపట్ట సహితము పూర్తి రూపములో యున్నది. కాని లింగమూర్తిపై ఒకవిధమైన అరుదైన శాఖా సాంప్రాదాయం మును సూచించు రేఖారూపము ముద్రించ బడినది. ఇది అభిషేక సమయములందు కనుపించును. ఆంజనేయ విగ్రహము దేవాలయ పంపులచేను నందు ఇటీవల కాలము వరకు పరుండబెట్టి యున్నది. వినాయక విగ్రహము ప్రధాన ఆలయమునకు ఈశాన్యమందు శ్రీతుమ్మల సుబ్బయ్య గారి చేను నందు వున్నది.


శ్రీ [illegible] వినాయక

నేటికిని బాలకోటేశ్వర స్వామి దేవాలయము చుట్టూ మాగాణిలో 4' ల లోతు త్రవ్విన గ్రామస్తులు ఆనాడు వాడిన మట్టిపాత్రల అవశేషములు కనుపించును.

ఇచ్చట అత్యంత సామాన్యునకును ఒక సందేహము కలుగక మానదు. దగ్గుమిల్లిలో రాములవారి ఆలయము సోమేశ్వరాలయము ఎందులకు శిథిలములైనవి ? శైవప్రతిఘటనానంతరము శైవులు ఇచ్చట శివలింగస్థాపన ఎందుకు చేయలేదు. ఎందుకు పోషణ లేదు - చరిత్రలోతులలోనికి పోయిన ప్రధమమున బౌద్ధమతము తదుపరి జైనమతముచే దగ్గుమిల్లి ఆవరించబడుటచేతనే - ఇచ్చట వైష్ణవ, శైవమత ఆదరణ కరువాయెను. శైవ పద ఘట్టనలు దగ్గుమిల్లి, తురుమెళ్ళ, ఆలపాడు, చినగాదెలవర్రు, పెదగాదెలవర్రుపై ఇంకనూ అనేక పరిసర గ్రామములపై నర్తించినవేళ పాడులకు పాడులు నిర్మానుష్యము లైయ్యేను. నేటికిని పంపుల చేనును ఒకనాటి ఆలయ కోనేరు అందురు. ఇచ్చట జల కేవలము 10 అడుగులలోనే ఉండును. ఒకనాడు కోనేరుల దేవాలయముఅనిన ఎంతటి అయిశ్వర్యమునుభవించిన వూరో ఊహించనగును. క్రీస్తు శకమారంభమునకు దగ్గరలోనిది ఈ గ్రామమునుకొనుటకు సందేహములేదు.

# 28. శ్రీ బాలకోటేశ్వరస్వామి దేవాలయ నిర్మాణము

పూర్వపు జగ్గుమిల్లిలో బ్రాహ్మణ కోడూరు వాస్తవ్యులు శ్రీ తిరపతి రాయుడు గారి సంకల్పముతో నిద్రలేచిన బాల కోటేశ్వరుడు 1904లో తన ముంగిట విజయ ప్రభను లేపుకొని లింగోద్భవుడై జీవకోటికి అభయమివ్వగా ది. 25.04 1907న ఆలయ ప్రవేశుడై - తదాది భక్తుల కానుకలతో మహాశివరాత్రి పర్వదినములందు రాబడిన ధనముతో య. 15.52 శెంట్లు మాగాణి భూమిని మరియు అపురూప నల్లరాతి ఆలయమును కూడగట్టుకొని నిబ్బరుడై సాలీనా నేడు నాలుగు లక్షల రూపాయల పైబడిన ఆదాయముతో లక్షకుపైగా భక్తుల సందడితో, శివరాత్రి పర్వదినమున సహస్రాధిక అభిషేకములతో నుండెను. ఈ దేవాలయ నిర్మాణమునకు గ్రామ పెద్దలు వివిధములైన శైవాగమ శాస్త్రములను తెప్పించి పరిశోధించి, గుంటూరు దగ్గరి వేములూరిపాడు క్వారీల నుండి నల్ల శిలలను తెప్పించి నిర్మించిరని తెలియుచున్నది. ఈ ఆలయము నందలి ఉపాలయములకు ప్రతిమాజాలకములు పెట్టుట మరియు ప్రధాన ఆలయ కుడ్యములపై మతాచార్యుల ప్రతిమలను మలపించుట ఇందులకు నిదర్శనము.

ప్రధాన ఆలయ విమాన గోపురము పంజర సహితమైనది. ఉపాలయ విమానములు రెండును బరువు తక్కువగ నుండుటకు చిట్టిపురాయిని వాడుట జరిగినదని పెద్దలు అందురు. చిట్టిపు రాతితో విమానములను నిర్మించిన ప్రథమ ఆలయ మిదియే అగును. సామాన్యముగ శివాలయమున శివునకు దక్షిణోత్తరములందు వినాయక, పార్వతీ అమ్మవార్ల విగ్రహము లుండును. కానీ అతికొద్ది చోట్ల మాత్రముండు వీరభద్రుడు దక్షిణ ఉపాలయము నందు ప్రతిష్ఠించబడియుండెను. ఒకనాడు ఆంధ్రదేశాన్ని ఉర్రూతలూగించిన వీరభద్రుని పళ్లెము (వీర శైవము) నకు మూలబీజము అగు వీరభద్ర ప్రతిష్ఠ చేయుట గోవాడ పెద్దల సుదూర ఆలోచనకు మచ్చుతునక. (ఇచ్చట వీరభద్రునకు జాతర ఉత్సవము చేయుట ఆరంభించిన మిక్కిలి విజయవంతమగుననుటలో సందేహము లేదు). మహా శివరాత్రినాడు అనేక కులముల వారు ఇచ్చట

అన్నదానము చేయుచుండిరి. ఈ ఆలయము చుట్టునూ మానవులే కాక పశువులు కూడా ప్రదక్షిణములు చేయును.



ఆలయంము నందలి నందీశ్వరమూర్తిని బ్రాహ్మణకోడూరు వాస్తవ్యులు యండ్లవల్లి చిన వెంకటాద్రి గారు సమర్పించిరి. దేవాలయమునకు కావూరు నివాసి వీరభద్రయ్య గారను పూజారిని నియమించుట జరిగినది.

## 29. బ్రాహ్మణ అన్నధర్మసత్రం

వేమూరు గ్రామస్థుడైన పానకాలయ్య అనువారు, వేమూరు గణపతి ఉత్సవాలకు, గోవాడ, కొటప్పకొండ శివరాత్రి ఉత్సవాలకు, భద్రాద్రి, చిలకలపూడి ఉత్సవాదులందు బ్రాహ్మణ బాటసారులకు అన్నదానము చేసెడివారు. చందాల రూపమున భక్తుల నుండి చందాలను తీసుకొనెడి వారు. ఈ అన్నసత్రం 1945 ప్రాంతము నుండి నడుపబడినది. తొలుత కాట్రగడ్డ రత్తయ్య (రత్తయ్య బావివద్ద ఆరంభించబడినది. తదుపరి పావులూరి రామకోటయ్య భజన) గారి ద్వారా య. 0.20 శెంట్లు మాగాణిలో పూడ్చి మెరక వేసినారు. బునాదులు గూడా వేయబడినవి. పానకాలయ్య గారి మరణానంతరము ప్రస్తుతము ఈ అన్నసత్రము పనిచేయుటలేదు. దీనికి గల షుమారు రూ.20 వేల ఖరీదు చేయు వంట సామాను భీమరాజు సూర్యనారాయణ వారి ఆధీనములో వున్నది.

# 30. పద్మసాలీల ధర్మసత్రం

1977నుండి నడుపబడుచున్నటుల తెలియుచున్నది. కాట్రగడ్డ కోటయ్య గారి కుమార్డు వెంకట్రామయ్య య. 0.20 శెంట్లు మాగాణిని సత్రము నిమిత్తము ధానము చేసెను. సదరు సత్రము చుట్టూ ప్రహరీగోడలు నిర్మించిరి. చలువ పందిళ్ళు క్రింద భోజనములు పెట్టుదురు. పద్మసాలీలు చందా వేసుకొని దీనిని నడుపుదురు.

# 31. శ్రీ బాలకోటేశ్వరకన్యకాపరమేశ్వరి ఆర్యవైశ్య అన్నదానసత్రం

ఈ సత్రమును మొదట "తుమ్మలపేట" పుల్లయ్య గారు ప్రథమములో స్థాపించిరి. తదుపరి ఆర్యవైశ్యచందాలతో ఆర్యవైశ్య యాత్రీకులకు ఉచిత భోజన, వసతి కల్పించిరి. ఈ సత్రం సుమారు 1962లో నిర్మించబడినది. దీని ఉద్ధతికి వేమూరి జగన్మోహనరావు, ఆదినారాయణల కృషి ప్రశంసనీయము. ప్రస్తుము డాబా మరియు నిల్వ నిధులతో నుండి యున్నది.

వీరభద్రయ్య గారు పూజారిగా నుండు సమయమున ఆప్రాంతములో రాత్రిళ్ళ గజ్జెలమోతలు వినిపించుచుండుటచే గోవాడలోని ఇరువురు గ్రామస్తులు అనేక పర్యాయములు అంజనేయస్వామికి శనివారమునాడు కొబ్బరికాయలతో బీజబలిఇచ్చెడి వారని ఒకానొక సమయుమున ఈసందర్భములలో సవ్వడి ఆలయము నుండి వచ్చుచున్నదని గ్రహించి వీరభద్రయ్య గారి సహాయముతో తలుపు తీయించ తలుపు తీసిన వీరభద్రయ్య గారు లోన దృశ్యము చూచి పడిపోయెనని లోన నుండి ఏదోశక్తి నుదురు భాగమును తాక అచ్చట నల్లగా కమిలినదని తదాది అతని మరణము వరకు జీవశ్చవములా జీవించ వారి కుముంబీకులచే జానకిరామయ్య అను చిన్న పిల్లవానిచే దైవారాధన చేయించిరని తెలియుచున్నది. జానకిరామయ్య గారి కుటుంబీకులు ఇటీవల ఇచట అర్చన వృత్తిని మానుకొనిరి.

1970 ప్రాంతమున పశువులు వగైరాల నిల్వనీరు చాలకుండుటచే గవర్నమెంటు పూరంబోకు స్థలము, ఒకనాటి చెరువును అయిన స్థలము య. 3.42 శెంట్లు దేవస్థానమునకు జెందునటుల పట్టాయిచ్చిరి. యిందు చెరువును త్రవ్వి నీటిని లాభాపేక్ష లేకుండ నిల్వయుంచుచు శివరాత్రి సమయమునందు ఉపయోగించుటకు గాను ప్రస్తుత ఆలయమునకు వాయువ్యమూల యివ్వబడినది. ప్రస్తుతము చెరువు త్రవ్వబడి యున్నది.

## 32. నవగ్రహాలయ నిర్మాణము

చాళుక్య, పల్లవుల కాలములో నిర్మితములైన దేవాలయములందు నవగ్రహములను ఆలయ ఆవరణము నందు ఆయా స్థానములందు ప్రత్యేకముగా నిర్మించెడివారు. కానీ చోళ రాజులలో రాజ రాజకుమారుడైన రాజేంద్ర చోళుడు (1012 టు 1044) నిర్మించిన గంగై కొండ చోళేశ్వరం నందు నవగ్రహములను ఏక శిలపై చదరపు రాతిలో పొందుపరచుట జరిగినది ఒరిస్సా కళింగ సాంప్రదాయంలో ద్వారముపైన నవగ్రహములను చెక్కినటుల తెలియుచున్నది.

ప్రస్తుతము నవగ్రహములను ఒకే పీఠముపై నుంచుట ఆంధ్రప్రదేశ్‌లో జరుగుచున్నది. ప్రత్యేక ఆలయములు ధనాధికమగుటచే ధనాభావ లోపమును తీర్చుకొనుటకు సమూహ విగ్రహ ప్రతిష్ఠలు జరుగుచున్నవి. ఆలయము నందు విగ్రహమును భక్తులు దర్శించుకొనునది పాదాదిబింబ దర్శనం. కానీ నవగ్రహ సమూహ ప్రతిష్ఠలలో కొన్నివిధముల బింబ దర్శనము భక్తులకు కానరాదు. పూర్తిగా పార్శ్వ దర్శనము ఎక్కువగుచున్నది. పై పరిస్థితులలో బింబదర్శనాను పద్ధతులలో నిర్మించబడినది మద్రాసులోని అగస్త్యాశ్రమము నందలి నవగ్రహ ఆలయము. అష్టభుజి ఆకృతిలో వాహన సహితమైనట్టిది. వీని తదుపరి ఆంధ్రదేశము నందు నిర్మితములైన కొన్ని ఆలయముల పరిశీలనానంతరము లోపాలోపములను సద్విమర్శ చేసి ఉపానము మొదలు స్థూపి వరకు అష్టభుజాకృతితో ద్వితల విమానముతో ప్రదిక్షణ మండపముతో చతుర్ద్వార, జాలక సహితముగా మరియు అష్టభుజ పీఠముపై ఏ గ్రహమునకు ఆగ్రహము స్వదిక్కునకు చూచుచు నవగ్రహములు వాహనారూఢులై, సతీసమేతంగా ప్రతిష్ఠ చేయుటకు ప్రయత్నము

జరిగినది. (పూర్వపు జగ్గుమిల్లిలో). ప్రస్తుతము జగ్గుమిల్లి గోవాడకు శివారుగా చిన్న జనావాస కేంద్రము.

ఇచ్చట ఒక నవగ్రహాలయము నిర్మించవలయునని తొలుత ది. 5.7.1985 న ఆలోచన కలిగినది. తదుపరి అనేక నవగ్రహాలయ నిర్మాణములను పరిశీలించుట జరిగినది. మద్రాసు కపాలేశ్వరాలయములో బుధుడు తూర్పుముఖముతో ఈశాన్య స్థానములో వుండ, కోటిపల్లిలో బుధుడు ఉత్తరముఖముతో ఈశాన్యమున ఉండును. ఆలయ నిర్మాణ ప్రసాద బేధములను పరిశీలించితిమి. ఆంధ్రదేశములోనే మొదటిసారిగా వడ్లమూడిలో శ్రీమల్లిఖార్జున దీక్షితులు గారింట శ్రీకారము చుట్టబడినది. స్వస్తిశ్రీ క్రోధన నామసంవత్సర ఆశ్వీయుజ శుద్ధ ఏకాదశి గురువారం శతభిషా నక్షత్ర యుక్త మకరలగ్న పుష్కరాంశకు సరియగు ది. 24.10.1985 పగలు గం. 12.52 నిమిషములకు డా॥ కొడాలి వీరయ్య గారు యం.యల్.ఏ గారిచే శంఖుస్థాపన గావించబడి స్వస్తిశ్రీ క్రోదన నామ సంవత్సర మాఘ బహుళ దశమి బుధవారం మూలానక్షత్రయుక్క మీనలగ్న పుష్కరాంశకు సరియగు ది. 5.3.1986 ఉదయం గం. 7.17 లకు పంచాహ్నిక దీక్షతో జరుపబడినది. ఈ దేవాలయ ప్లానును చూచిన ఆంధ్రప్రదేశ్ దేవాదాయ శాఖ అడ్వయిజరీ బోర్డు శైవాగమశాఖ సభ్యులు, శైవాగమ పండితులు ఆగమసామ్రాట్ శ్రీ అయలూరి సుబ్రహ్మణ్యం గారు మిక్కిలి ప్రశంశించుట జరిగినది. ది. 5.7.1986న నవగ్రహాలయ విగ్రహములను గుంటూరు పట్టణము కొరిటెపాడు నివాసి దేవిరెడ్డి వీరాస్వామి గారి కుమార్డు శ్రీ బాలాజీయను వారు మలచుట జరిగినది. ఇందలి గృధావాహనముపై నీలాసహిత శనీశ్వర విగ్రహమును మొదలుపెట్టుటకు ముందు వారికి గొంతుకాన్సరు వ్రాధియని గుర్తించియు సరియగు అన్నపానములను స్వీకరించక 7రోజులలో విగ్రహమును మలచి తదుపరి 3వ నాడు వారు పరమపదించిరి. ఈశనీశ్వర అభిషేక దర్శనమునకు దూరప్రాంతముల నుండియు ఇచ్చటికి వచ్చెదరు. శివరాత్రి శనిత్రయోదశి వర్వదినములందు ఇచ్చట వందలాది శనీశ్వరాభిషేకములు జరుగుచుండును. నవగ్రహ ప్రతిష్టా సమయమున అనాదిగా

అచ్చటే చేలలో పడివున్న వీరాంజనేయ - వినాయక విగ్రహములను శ్రీ బాలకోటేశ్వరాలయమునకు ఈశాన్య భాగములో నిర్మించబడిన నవగ్రహాలయమునకు ముందు కుడివైపు వీరాంజనేయ - ఎడమవైపున వరసిద్ధి వినాయక విగ్రహములను పీఠముల నిర్మించి పైభాగమున నిల్పుట జరిగినది. జైనుల ఆరాధ్య దైవము సూర్యుడు సప్తాశ్వములతో గూడిన ఏకచక్ర రథముపై అనూరుడు రథసారథిగ యుండ ఉషా - ఛ్ఛాయాసమేతుడై - స్వతంత్రాలయమున ప్రతిష్ఠితుడై - తిరిగి ఈ ప్రదేశములో నివేదనలందు కొనుచుండెను.

నవగ్రహాలయ నిర్మాణము దేవాదాయ శాఖాధికారులలో తీవ్ర అలజడి రేపినది -వున్నతాధికారులైన శాస్త్ర పరిజ్ఞానులకు ఇది ఒక ఇబ్బందిని సృష్టించినది. ఈనేపద్యములో జరిగిన వ్రాతపూర్వక వాదోపవాదనులు.

1) నవగ్రహాలయ నిర్మాణమునకు శాస్త్రసమ్మతం ! యేశాస్త్రంలో అధ్యాయం, వగైరాలు తెలుపవలెను.

జ: కపర్ధీ సంహిత యందుగల నవగ్రహ ప్రతిష్టాపటలము నందు నవగ్రహములకు ఆలయము నిర్మించవలెనని యున్నదని చెప్పిరి.

2) నవగ్రహములకు ఆలయములో ద్వారముల వద్ద ద్వారపాలకులను పెట్టుటకు దాని ప్రమాణం.

జ: ఈశాన శివగురు దేవ పద్ధతి మరియు గ్రహనఖ తంత్రము నందు విపులముగా యున్నది.(ఈశానశివగురు దేవపద్ధతి 51వ పటలము,9వశ్లోకము)ఇతర శైవాగమముల యందును కన్పించును.

3) నవగ్రహములకు దేవాలయముపై కలశ ప్రతిష్ట, కుంభాభిషేకము వగైరా చేయుటకు ప్రమాణము. 4 ద్వారములు, 4 కిరిటీలు ఉండునట్లుగా అధారటీ.

జ: దేవాలయ నిర్మాణము పూర్తిచేయుటలో కలశము పెట్టుట ఒక భాగము. అటులనే ప్రతిష్టలో కుంభాభిషేకము ఒక భాగము. (దేవశ్యాభిముఖమ్

ద్వారమ్) బింబాగమము ప్రసాద లక్షణ పటలము నందుగల ప్రమాణముననుసరించియును; ముఖలింగ ప్రతిష్ఠిత దేవాలయము గర్భాలయము నందు 4 ద్వారములు ఉండవలెనని అన్ని ఆగమములు చెప్పబడి యున్నందునను నవగ్రహములకు నాలుగు దిక్కుల యందును ముఖములు కలిగి యున్నందున విధిగా ద్వారములు పెట్టవలయును. ఇట్టివి కంచికాళహస్తి, లలోనే గాక తెనాలి టౌను, మరియు చేబ్రోలు నందును గలవు. మరియు కిరిటీలను గూర్చి అంశమత్యాగ మములో జాలకలక్షణ పటలమునందు గలదు. చేబ్రోలులోని (తెనాలి తాలూకా) బ్రహ్మదేవాలయము నందు ద్వారపార్శములందు జాలకములు గలవు.

4) నవగ్రహముల వాహనములపై అమ్మవార్లతో ఉండునట్లుగల ప్రతిష్ఠ చేయుటకు అధారటీ.

జ:- కపర్ధిసంహిత నవగ్రహ ప్రతిష్టావిధి యందు అమ్మవార్ల విషయము కలదు.

5) నవగ్రహముల దేవాలయము ఎనిమిది పలకలుగా కట్టుటకు అధారిటీ.

జ:- నవగ్రహము దేవాలయమును నాలుగు పలకలు, 8 పలకలు, మరియు గుండ్రముగాను నిర్మించవచ్చును. పై శాస్త్రమున ఈవిషయము తెలియనగును.

6) నవగ్రహ దేవాలయములు పైవిధముగా అనగా మీరు నిర్మించు విధముగా ఎక్కడ ఎక్కడ నిర్మాణము జరిగినది.

జ:- మద్రాసు నగరములోని పాండే బజారు అగస్త్యాశ్రమమునందు 4 ద్వారములు, మూలల యందు కిరిటీలతోను, విమాన గోపురము, కలశముతో శిల్పనైపుణ్యముతో శ్రీ కుప్పుస్వామి స్థపతి గారి ఆధ్వర్యమున నిర్మించి యున్నారు. ప్రకాశం జిల్లా, నిడమనూరులోను, గుంటూరు టౌనులోని పార్వతీపురం నందునను ఇట్టి నమూనా ఆలయములు గలవు.

7) నవగ్రహములలో ప్రాగాది 8 విగ్రహముల ముఖ నిర్ణయము:-

కొన్ని ఆలయములందు రవి శుక్రులు తూర్పు, శని చంద్రులు పశ్చిమమునకును, బుధ గురులు ఉత్తరమునకు, కుజ, రాహు కేతువులు దక్షిణ ముఖములుగాను ప్రతిష్టించి యున్నారు.

ఇట్లు వున్న ఆలయములలో కొన్ని విగ్రహముల ముఖ దర్శనము భక్తులకు అగుట లేదు. విగ్రహములు వెనుక భాగము కన్పడుటవల్ల భక్తులుకు అసంతృప్తి కలిగించుచున్నది. పూర్తిగా అన్ని విగ్రహముల ముఖదర్శనము లభించుటలేదు.

మద్రాసులోను, (పాండీబజారు అగస్త్యాశ్రమము) ప్రకాశం జిల్లా బి నిడమనూరులోను, 8 పలకలుగా ఆలయము నిర్మించి సూర్యుడు తూర్పు, మిగతా 8 విగ్రహములు 8 దిక్కులు చూచునట్లుగా ప్రతిష్టించి యున్నారు. ఇట్లు ప్రతిష్టించి యున్నందున, భక్తులకు మూర్తుల దర్శనము చక్కగా అగుటయే కాక పూజాదులు చేయించుకొను భక్తులకు చాలా సౌకర్యముగా వున్నది.

ఆగమ శాస్త్రములో సూర్యుడు కాక మిగిలిన 8 విగ్రహములకు ముఖ నిర్ణయము చెప్పబడలేదు. మరియు ప్రాగాది 4 దిక్కుల గల 4 విగ్రహములు, ప్రగాది దిక్కులను చూచుచుండ ఆగ్నేయాది వి దిక్కుల యందు గల 4 విగ్రహములు ఆగ్నేయాదివి దిక్కులు చూచుటలో దోషము లేదనెడి భావముతోను, 8 విగ్రహములకు ముఖ నిర్ణయము లేనందునను ఈవిధముగా స్థాపించి యుండురు.

పై దేవాలయములు పరిశీలించి భక్తులకు పరిపూర్ణ సౌకర్యము, తృప్తి కలుగుటకును మరియు శాస్త్ర విరుద్ధము కానందునను ఇట్లు నిర్మించి ప్రతిష్టించుట అయినది.

ఆగమములో 8 విగ్రహములకు ముఖ నిర్ణయము లేదు.

8) పరివార అలయ పీఠము మూల పీఠముకన్న ఎత్తును గురించి:

ఆగమములో ఈ నియమము లేదు. ఉదాహరణ బలిపీఠమును గురించి - పూర్వకారణము, బలికర్మ విధి పటలం - 48 వ శ్లోకము.

**"ద్వారోత్సేధం సమం శ్రేష్ఠం, సత్రిపాదంతు మధ్యమం,**
**ద్వారార్ధమధమంవిద్ధి, విస్తారోత్సేధతత్సమం."**

అనియున్నందున పీఠముల ఎత్తును గురించి నియమము లేదు.

ఇటీవల పొన్నూరు పట్టణములో శ్రీ భావనారాయణ స్వామి వారి ఆవరణలో గల శ్రీ కాశీవిశ్వేశ్వర స్వామి వారి ఆలయము ప్రక్కన డిపార్టుమెంటు వారిచే నూతనముగా నిర్మించి ప్రతిష్ఠించిన విశాలాక్షి అమ్మ వారి పీఠము, మూలపీఠముకన్న (అనగా విశ్వేశ్వరస్వామి వారి) షుమారు 2 అడుగుల ఎత్తు ఎక్కువగా వున్నది.

9) సూర్యుడు ఇద్దరు భార్యలతో వున్న వివరణ గురించి:

సూర్యునకు ఇద్దరు భార్యలతో ప్రతిష్ఠించవలయును.

అజితాగమము. సూర్యస్థాపన విధి పటలం - 90 శ్లోకం

" దక్షిణోత్తమయోస్తస్య, పార్శ్వయోస్తు జనార్దన,
ఉషాంచ ప్రత్యుషాంచైన కృత్వాచైకాసనస్థితాం"

10) కర్ణకూటములు - జాలకముల గురించి:

అంశుమత్కాశ్యక (కాశ్యపశిల్పం). నాగరాది విమాన పటలం - 31వ శ్లోకం.

అను ప్రమాణము వున్నందున కూటములు జాలకములు నిర్మించవలయును.

11) ద్వారపాలకులు:
ద్వారపాలకులు సూర్యునికు మాత్రమే (చతుర్ద్వారముల యందలి)

12) వుపానాది స్థూపిపర్యంతం నిర్మించిన దానికి ప్రమాణము
ద్రావిడ విమానము 3 విధములు. అందు ఈ నిర్మాణము ఒకవిధము.
అంశుమత కాశ్యపశిల్పం నాగరాది విమాన పటలం. 39 శ్లోకం.
" ఏతచ్చద్రావిడంఖ్యాతం హూద్యాత్ముద్మ లాంతకం,

పై పటలము నందు వుపానాది స్థూప్యంతం అష్టాశ్రమముగా నిర్మించవలయునని వున్నది. త్రివిధ ద్రావిడ విమానములలో ఇది ఒకవిధము. పై పటలమునందే 28 శ్లోకము నుండి 40 శ్లోకముల వరకు ద్రవిడ విమానము గురించియు గర్భాలయ జాలక, కూటముల గురించియు స్పష్టముగా యున్నది. చూడనగును.

పై పటలము నందే 24 శ్లోకం 27 వరకు నాగర విమానమునకు కూడా గర్భాలయమునకు జాలకములు చెప్పబడి యున్నది. ఇట్లు జాలకములతో నిర్మించిన గర్భాలయములు వున్నవి.

ఏదిఏమైనను చివరకు పట్టువిడుపుల అనంతరము చివరకు యధాస్థితి కొనసాగుచున్నది.

# 33. గోవాడ గ్రామ వర్ణన -నైసర్గిక వర్ణన

గోవాడ 16°-05 ఉత్తర అక్షాంశం 80°-41 తూర్పు రేఖాంశములపై గలదు.

ఆదిన గోవాడ నడిబొడ్డు ప్రస్తుతము అంబటాయి ప్రదేశము నుండి చూచిన గోవాడయును జైన వాస్తు సాంప్రదాయగ్రామమని తెలియుచున్నది. గర్భము మిర్రు చుట్టు పల్లము ఇచ్చట గమనించనగును.

భూమి యొక్క వర్ణమును బట్టి గోవాడ శూద్ర (కృష్ణ) వర్ణమునకు చెందినది. ఆయుర్వేద శాస్త్రానుసారము ఈ భూమి నాల్గవ తరగతిగా ఎంచబడును. (1) తెలుపువర్ణముగల భూమి ప్రథమ తరగతి, రక్త వర్ణము గలది రెండవ తరగతి,పసుపు వర్ణము గలది మూడవ తరగతి, ( ఆయుర్వేద శిక్ష - భారతీయ విజ్ఞానం)

గోవాడ గ్రామాకారమును బట్టి భద్రాసనమునకు చెందినట్టిది.

గోవాడలోని రాజ వీధులు తూర్పు పడమరలుగను, వామన వీధులు ఉత్తర దక్షిణములుగాను వుండును. గృహ నిర్మాణములు శ్నాలా పద్ధతిననుసరించుచు బాహ్యాంతర గృహములుగ ఏకగృహముగ, రెండుగ నిర్మాణము జరిగినవి. (2) ఆకారమును బట్టి గ్రామములు వృత్తము, సమస్థితము, భద్రాససము, చక్రవావయము,దండాకారము, కూర్మాకారము మొదలగువిధములు గలవు. ( ఆయుర్వేద శిక్ష - భారతీయ విజ్ఞానం )

మానసారమును బట్టి, దండక, సర్వతోభద్ర, నంద్యావర్త, భద్రకము స్వస్తిక, ప్రస్తర, కర్ముక చతురేముఖ విధానములలో సర్వతోభద్ర విధానమును పోలిన చతురేముఖ విధాన గ్రామ నిర్మాణమై యున్నది.

# 34. గ్రామ చెరువులు

| | | | |
|---|---|---|---|
| 1. | మాల చెఱువు | 5. | చాకలి చెఱువు |
| 2. | బాలయ్య చెఱువు | 6. | అంకమ్మ చెఱువు |
| 3. | ఊర చెఱువు | 7. | రామయ్య చెఱువు |
| 4. | బళ్ళమ్మ చెఱువు | 8. | మంగా చెఱువు |
| 09. | దాసరి గుంట | 12. | పాటిమీద చెఱువు |
| 10. | పేరాం చెఱువు | 13. | శేషయ్య చెఱువు |
| 11. | తాళ్ళ చెఱువు | | |

1 నుండి 6 వరకు గ్రామములోన ఉన్న చెఱువులు కాగా 7 నుండి 13 వరకు గ్రామమునకు వెలుపల పశువులు వగైరాల కొరకు త్రవ్వబడినవి.

# 35. మంచినీటి బావులు

| | | | |
|---|---|---|---|
| 1. | రంగన్న బావి | 7. | నాయుడమ్మ బావి |
| 2. | దేవయ్య బావి | 8. | రత్తయ్య బావి |
| 3. | లింగయ్య బావి | 9. | మాచమ్మ బావి (కావూరివారి) |
| 4. | చాకలి చెఱువు మీది బావి | 10. | దాసరిగుంట బావి |
| 5. | బళ్ళమ్మ బావి | 11. | మంగాచెఱువుబావి |
| 6. | జ్ఞానమ్మ బావి | 12. | తాళ్ళ చెఱువుబావి |
| | | 13. | పుట్టబావి, వగైరా.... |

ఇందు 1 నుండి 6 గ్రామములోనివి కాగా, 7 నుండి 13 వగైరాలు పశువుల, బాటసారుల అవసరములు తీర్చునట్టివి.

పై వానిలో లింగయ్య బావి వద్ద స్మశానము నుండి తిరిగి వచ్చుచు స్నానాదికములు. రంగన్నబావి వద్ద స్త్రీ కర్మాదులు చేసెడివారు.

# 36. రహదారులు

గోవాడ నుండి ఉత్తర దిశన అమృతలూరు రోడ్డు దారి, ఈశాన్యమున పాంచాళవరమునకు దారి, తూర్పు నుండి గూడవల్లి, నడింపల్లిదారి డొంక, దక్షిణ ఆగ్నేయమున చెరుకుపల్లి రోడ్డు, దక్షిణ నైఋతిన కావూరు రోడ్డు, ఇంటూరు రోడ్డు, పడమర - యలవర్రు రోడ్డు దారులు పొరుగుగ్రామాలకు కలవు.

# 37. గ్రామ వాయువ్య ప్రాశస్త్యము

కృష్ణానది నుండి సముద్రం వరకు విజయవాడ - నిజాంపట్నం పంట, ప్రయాణకాలువలను షుమారు 150 సం॥ముల క్రితము బ్రిటీషు వారు త్రవ్వగా తూర్పుకాలువ తురుమెళ్ళ వద్ద నుండి చీలబడిన గుళ్ళపళ్ళి పెదకాలువ గోవాడ ప్రజలకు వ్యవసాయ భూములకు అమృతవాహిని. గోవాడ వ్యవసాయ ఆర్థిక వనరులు అన్నియు దీనిపైననే ఆధారపడి యున్నవి. గోవాడకు వాయువ్యము నుండి గోవాడ గ్రామ దక్షిణ దిశగా అటునుండి ఆగ్నేయముగా ప్రవహించుచు గుళ్ళపల్లి - చెరుకుపల్లిల లోనికి ప్రవేశించును. ఈ కాలువపై గోవాడ హద్దులలో 3 వంతెనలు నిర్మించబడినవి రాకపోకలకు ఇబ్బంది లేకుండగ. బహుశ గుళ్ళపల్లి పెదకాలువ సదాశివరాయల నాటికి ముందు దగ్గుమిల్లి గోవాడల మధ్య సరిహద్దు అయి ఉండవచ్చును. ఆనాటికి అది వాగు అయి వుండవచ్చును.

# 38. అంబరాయి

<u>అంబమ్మ</u> :- షుమారు వంద సం॥ములకు పూర్వము 200 సం॥ముల మధ్య యతిరాజులు అను వారిచే గ్రామములోనికి అంటువ్యాధులు వగైరా గాలి వ్యాధులు రాకుండా కాపాడు నిమిత్తము యంత్రసహిత శిలను గ్రామ నడిబొడ్డున వేయబడెను. ఈ కుటుంబీకులు వల్లెకోన వద్ద వుండుచున్నటుల తెలియుచున్నది. కుటుంబములో శుభకార్యములు, చేసుకొనునపుడు ఈ శిలను దృష్టియందుంచు కొని ప్రదక్షిణ సహిత దారిన వెళ్ళు ఆచారము గలదు. ఈ శిలను కడిగి పసుపు కుంకుమలతో గ్రామస్తులు అలంకరించి బీజబలి, యిచ్చెడివారు. ఇచ్చట

పంబలవారు కథలు చెప్పెడివారు. ఈ శిలవద్ద జంతువధ (దున్నపోతు) జరిగినపుడు తలను గూడవల్లి డొంకన పొలిమేరకు తీసుకొని పోయెడివారు. బలిసమయమున తోలువారు, కాట్రగడ్డవారు ఎవరిముందును వాదన గతము నందు వచ్చినపుడు ఇరువురు ఓకేసారి బలి ఇచ్చెదరు. ఇది గ్రామతొలి అగమనమును సూచించుచున్నది. గ్రామ దిశను ఈశిలయే చూపుచుండును. గోవాడ గ్రామ వాస్తు ఇచ్చట నుండియే మొదలగును. ఇచ్చట పూజలు కుమ్మర్లు నిర్వహించుచుందురు. పంబలవారు కథ చెప్పుటకు ముందు తొలిరోజు దగ్గుమిల్లిలోని దేశమ్మకు పూజలు చేయు ఆచారము కలదు. 2వ రోజు రామయ్య చెఱువు సమీపములో గల మద్దిరాలమ్మ (మదారు సాహెబ్, మద్రాలమ్మకు) పూజలు చేయు ఆచారము తదుపరి గ్రామ అంబరాయి అని పెద్దలు చెప్పుదురు.

గ్రామవాస్తునుబట్టి చూడ ప్రస్తుత అంబరాయి షుమారు 100 సంవత్సరముల పూర్వము వేసినను - అంతకుపూర్వము అచ్చట పాతశిల మరియొకటి ఉండి వుండవచ్చని తెలియుచున్నది. కారణము గ్రామములోని వేణుగోపాలస్వామి ఆలయము గూడా 1549లో అంబరాయినిబట్టి ఏర్పడిన వీధి వాస్తునుబట్టి - నిర్మించబడినది.

## 39. బళ్ళమ్మ లేక బండ్లమ్మ దేవత

చందోలు కైఫీయతులోని చందోలు గ్రామదేవత బండ్లమ్మ, గోవాడ బండ్లమ్మ అక్క చెళ్ళెళ్ళను నానుడి. చందోలు మాదిరిగానే ఇచ్చటను గుడివద్ద గల చెఱువును బళ్ళమ్మ చెఱువు అందురు. అటులనే బండ్లమ్మ బావి యిచట నున్నది. ఈ దేవత పూజారులు చాకళ్ళు. గ్రామములో శుభకార్యములు జరుగు ఇండ్లవారీ బళ్ళమ్మకు చద్ది నైవేద్యములు పెట్టెదరు. గ్రామదేవతకు గుడిస్థలము అత్తవారిల్లు అందురు. గ్రామము పుట్టిల్లు అందురు. గ్రామారిష్టములు జరుగునపుడు చుక్క ఎదురులేని రోజు చూచి మంచిరోజున గ్రామములోనికి తీసుకొని వచ్చి లైబ్రరీ దగ్గరలో రోడ్డుకు తూర్పున పురము వేసి వుంచెదరు. రోజు చాకలి ఘటము నెత్తిన పెట్టుకొని ప్రక్కన పోతురాజుతో (బొంగుకర్రకు వేపాకు 5' ఎత్తు కట్టెదరు) గ్రామములో ఇంటి ఇంటికి తిరుగుదురు. గ్రామస్తులు

ఘటము ఘటము మొక్కులు తీర్చుకొందురు. తిరిగి దేవరను పురము నుండి అత్తవారి ఇంటికి పంపుటకు ముందు 1 రోజు కుడుములు గ్రామస్తులు నివేదన చేయుదురు రెండవ రోజు గారెలు, బూరెలు, వేట వగైరాలతో నివేదన చేయుదురు. ఆమెపురము నుండి బయలు వెడలగనే పురమును తగులబెట్టెదరు (లంక తగులవేయుట అందురు) తిరిగి అంబరాయి వద్దకు వచ్చి అచ్చట నుండి వచ్చిన త్రోవన గాక ఎడమవైపు రోడ్డు ద్వారా అత్తవారింటికి సాగనంపెదరు. ఈ అమ్మవారికి ఘంటములతో నీరు పోసిన వర్షములు కురియునని గ్రామనమ్మకము. ఈ ఆలయము శిథిలావస్థకు రాగా షుమారు 50 సం॥ముల పూర్వము మండవ సూరమ్మ గారు పునఃనిర్మాణము చేసినారు. ఓనాటి జంట్లమ్మయే ఈనాటి బండ్లమ్మ యనవచ్చునేమో. జంట్లమ్మ దగ్గుమిల్లి పరిరక్షక దేవత. దగ్గుమిల్లిలోని భాగస్థమైన గోవాడ జంట్లమ్మ గాక బండ్లమ్మ ఎట్లగు రెండునూ ఒకటియే ననవచ్చును.

## 40. శ్రీకోదండరామస్వామి దేవస్థానము

ఈ దేవాలయము 1889 వ సం॥మున పావులూరి సుబ్బన్న గారిచే నిర్మించబడినది. తిరిగి 1928లో జీర్ణోద్ధరణ గావించబడినది. ఈ దేవాలయమునకు య.7.80 శెంట్లు భూమి గలదు. అర్చకులు + మేనేజిమెంటు = 6.00 + 1.80 చైత్రశుద్ధ నవమికి కళ్యాణము జరుగును. 5వ తరము నడుచుచున్నది.

## 41. శ్రీరామ మందిరము

రజక పాలెంలో ఆర్.టి.సి. రోడ్డు ప్రక్కన గలదు. ప్రతి నిత్యము దీపారాధన చేయుదురు. నూతక్కి సూర్యనారాయణచే అర్చన పూజలు నిర్వహించబడును. కొండవీటి పిచ్చియ్య మేనేజిమెంటు. తొలుత ఈ మందిరము 150 సం॥ములకు పూర్వము నిర్మించబడినది. షుమారు 45 సం॥ముల క్రితము పూనఃనిర్మాణము గావించబడినది. ఇచ్చటనే దక్షిణమున చెఱువు దానికి పడమటి నైఋతిన బావి గలదు.

# 42. శ్రీ వేణుగోపాలస్వామి దేవస్థానము

ఈ గ్రామమును వేదమార్గమును ప్రతిష్ఠించవలెనను సదాశయముతో 1544లో శ్రీ సదాశివదేవ మహారాయల వద్ద అగ్రహారముగా శ్రీ చిలకమర్రి వల్లభాచార్యులను నాయన దానము పొందెను. సదాశివ దేవరాయల చేతనే దగ్గుమిల్లి, గోవాడలను కలిపి శ్రీ భాష్యపురమని క్రొత్త నామము ఏర్పరచెను. వారు ఈ గ్రామము నందు నివశించుచు 1549లో చోళంగివరం అను గ్రామము నుండి (కంచి ప్రాంతములోనిది) సంతాన వేణుగోపాలం అను విగ్రహమును తెప్పించి రుక్మిణీ సత్యభామా సమేతముగా ప్రతిష్ఠించెను. ఈ ఆలయ పోషణ నిమిత్తము 5 కుచ్చెళ్ళ భూమి షుమారు య.55.00 లను ఇచ్చెను. ఆలయ అర్థ మండపములో 5గురు ఆళ్వారుల శిలను ఉంచెను. తదుపరి ఈ భూమిలో య.6.00 భజంత్రీ సర్వీసునకు ఇవ్వగా, య.48.84 శెంట్లు నికర భూమి గలదు. భజంత్రీమాన్యము వారు సర్వీసు చేయుటలేదు. ఇందు య.32.56 శెంట్లు అర్చక సర్వీసు పడితరములకు ఇవ్వగా మిగిలిన య.16.28 శెంట్లు మేనేజిమెంటు క్రింద గలదు. చైత్రపౌర్ణమికి కళ్యాణము జరుగును. వైఖానస సాంప్రదాయము ననుసరించి పూజాదికములు నిర్వహించబడుచున్నవి. 1954లో జీర్ణోద్ధరణ గావింపబడినను ప్రస్తుతము ఆలయము పల్లమున నుండుటచే జీర్ణోద్ధరణను కోరుచుండుటచే శ్రీ వేణుగోపాలస్వామి వారికి కళాపకర్షణ చేసి మూలవిరాట్టును బాలాలయము నందుంచి ది.08.01.2004న దేవాలయమును పడగొట్టి నూతనాలయ నిర్మాణము నిమిత్తము శంఖుస్థాపన చేసి, గ్రామస్థులు తమ చందాలతో మహిళల ఆధ్వర్యములో ఆలయము పునఃనిర్మాణము పూర్తిగావింపబడి ది. 02.06.2004న పునఃప్రతిష్ఠ గావింపబడినది. ఇది మిక్కిలి శుభసూచికము. చిలకమర్రి వారి ఆశయములు 500 సం॥ములకు నామరూపములు నశించగా అంతరించిన శైవ సంపద, సంస్కృతి గత 100 సం॥ములుగా ఉప్పెనరూపము దాల్చుచున్నదనుటలో సందేహము లేదు. కళ్యాణోత్సవ గరుడ గుడ్డ సమయమున ఆహూతులైన వారిలో కాట్రగడ్డ వారు అచట వున్న ముందు వారిలో ఒకరికి

బొట్టు పెట్టెదరు. తదుపరి మిగిలిన వారికి పెట్టెదరు. కాట్రగడ్డ వారు లేకున్న అచ్చట గడపకు పెట్టి తదుపరి మిగిలిన వారికి పెట్టెదరు. ఈ ఆచారము స్థానికాచారము.

## 43. కాట్రగడ్డ వారి దేవర - అంకమ్మ

పూర్వం కాట్రగడ్డ వారి దేవర ప్రస్తుతము దేవయ్య గారి సూర్యనారాయణ ఇంటి స్థానములో ఉండెడిదని - తదుపరి సజ్జావారిదొడ్డి అని పేరు గల ప్రస్తుతము ఉన్న స్థానములోనికి మార్చబడినది. లోగడ పావులూరి ; ఆలపాటి వారికి గూడా వంశదేవరలు ఉండేవని - కానీ తదుపరి కాల గర్భములో కలసి పోయినవి.

## 44. గ్రామపురోహిత నివాసము

శ్రీ ఆలపాటి దేవయ్య గారు అను వారు తనకు గల ఒక పెంకుటింటిని గ్రాపుపురోహిత నివాసంగా ఉండుటకు ధర్మము చేయుటయే గాక, సదరు ఇంటి రిపేరు వగైరాలకు య.1.00 భూమిని ఇచ్చి శుభా శుభకార్యములకు పూరోహితుని అందుబాటులో వుంచుటకు సహకరించిరి.

## 45. గోవాడ - దగ్గుపల్లి - చుట్టు గ్రామాలు

గోవాడ - దగ్గుపల్లిల చుట్టూ నడిమిపల్లి, పొన్నపల్లి, గుళ్ళపల్లి, చెఱుకుపల్లి, ఇంటూరు, కావూరు, యలవర్రు, అమృతలూరు, పాంచాళవరం మధ్యన గోవాడ - దగ్గుపల్లి.

పైవానిని గ్రామ చివరి అక్షరములనుబట్టి వర్గీకరించిన

| 1. పల్లి | 2. ఊరు | 3. వాడ | 4. వర్రు | 5. వరం |
|---|---|---|---|---|
| నడిమిపల్లి | ఇంటూరు | గోవాడ | యలవర్రు | పాంచాళవరం |
| పొన్నపల్లి | కావూరు | | | |
| గుళ్ళపల్లి | అమృతలూరు | | | |
| చెఱుకుపల్లి | | | | |
| దగ్గుపల్లి | | | | |

ఇందు వాడ అనునవి ఇతర పరిసర గ్రామములలో గుడివాడ, పూడివాడ, చదలవాడ వగైరాలు కాగా, వర్రు గొడవర్రు, చినగాదెలవర్రు, పెదగాదెలవర్రులును, వరం - రుద్రవరం, జయవరం, కేతవరం, కరెవరం, గణపవరం వగైరాలునూ పరిసరములందు గల గ్రామములు.

# 46. గ్రామనామము ఏర్పడిన విధము

**1. నడిమిపల్లి :-** నడిమిపల్లి - ప్రథమముగా కాల, కొల్త (మాన) సూచీ గ్రామముగా భావించనగును. నడిమిపల్లి గ్రామము గూడవల్లి, - పొన్నపల్లిల ఆవిర్భావము తదుపరి నడిమిని వెలసినపల్లె కథగానే నిలచినది. పెద్దలు దిగ్వాచక గ్రామనామములో నడిమిపల్లిని చేర్చుదురు.

1.ఎ) గూడవల్లి:- గూడవల్లికి పూర్వనామము కుముదువల్లి. ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతికము అను అష్టదిగ్గజములలో కుముదము ఒకటి. తంత్రశాస్త్రములలో సుకుముదిని ఒకటి.

కుముదవల్లి - కలువతీగ - కలువకాడ - మరియొక అర్థమున కలువల స్థావరము. పల్లపు ప్రదేశమై కలువల నిలయము కావచ్చును. దక్షిణవాహిని గంగవాలి (గంగోలు) మరియు పొన్నపల్లి తూర్పు పొలిమేర వాగునుబట్టి మధ్యస్థ స్థలము (క్రీ॥శ॥ 1448 అన వేమారెడ్డి తామ్రశాసనము పొన్నపల్లి హద్దులు). భూస్థితినిబట్టి జలసూచి గ్రామము.

**2. పొన్నపల్లి :-** పొన్న - వృక్షనామ సూచికగా కనపడుచున్నను వ్యక్తినామ సూచియైనను కావచ్చును. లేక పొన్ను - పొన్నగా కాలాంతరము చెంద, పొన్ను సూచియైనను కావచ్చును. పొన్నుపల్లి కరగ్రామ సూచి. శ్రీనాథుని శాసనములలో "పొన్నుపల్లె" చూడనగును. పొన్ను = స్వర్ణ లేక బంగారు - నేలస్వాభావికతలో కాంతి యొకటి. కావచ్చును.

**3. గుళ్ళపల్లి :-** గుళ్ళపల్లిలో సోమేశ్వర, విఘ్నేశ్వర, గోపాలస్వామి, నూకాలమ్మ, మహంకాళి, దుర్గ, మెట్టున భైరవుడు ఆదిగా అనేక దేవతా ప్రతిష్ఠలతో పరివేష్టిత

మగుటచే గుడులపల్లి - గుళ్ళపల్లిగా జననామము వచ్చినది. సప్తకావు పరివేష్టిత ప్రాంతమైన దేశమున మధ్యన మెట్టుకావు అధిష్టేశ్వరుడు భైరవుడైనందున గుళ్లపల్లి పూర్వ నామము భైరవేశ్వరము అయినది. సిద్ధ, వటుక, కంకాళ, కాల, కాలాగ్ని, యోగిని, మహాశక్తి, భైరవము అని భైరవాష్టకములు కలవు. కాళీతంత్ర, భైరవి, భైరవ, జ్ఞానభైరవ, ఆకాశభైరవ, కరాళభైరవ, కాలభైరవ, భూతభైరవ ఆదిగా గల తంత్రశాస్త్రములనుబట్టి కాపాళికమతము ఇచట విలసిల్లినదని తెలియుచున్నది. వేమూరు దగ్గరలోని పాలకడ దగ్గరి ధననిధికి భైరవుడు కాపుండి - భైరవపాలిత ప్రాంతమనుట జూడ మరుగననున్న ప్రాచీనశాస్త్ర శిధిలాలు ఇంకనూ అచట నున్నవని కైఫియతుననుసరించి తెలియంగలవు. సంతానార్థులు, తటాక - ధననిక్షేప - అగ్రహార - దేవాలయ - వన - ప్రబంధనిర్మాణ - సత్ర ప్రతిష్టలు చేయుదురు. ఇందు భైరవస్థానమున ధననిక్షేపము వుండుట గమనించదగినది. ఇది మతసూచి గ్రామము. భైరవేశ్వరము శైవసాంప్రదాయకమని కొందరి అభిమతము.

**4. చెఱుకుపల్లి :-** ఇచట స్థలవాసుడు చెన్నకేశవుడు. గ్రామదేవత పోలేరమ్మ. చెఱుకుపల్లి అనాది నామము ఇక్షుపురము. ఇక్షు - అన ఎర్ర - నల్ల సమ్మిళితము. ఇక్షు = చెరుకు. ఇది భూ లేక జల రంగునుబట్టి ఏర్పడినది. క్షార, ఇక్షు, సుర, ఘృత, దధి, క్షీర, శుద్ధజల సముద్రములలో ఇక్షు సముద్రము గలదు. ఎర్ర - నల్ల సముద్రములను ఇక్షు సముద్రము అందురు. ఇది విశేషణసూచిక నామాలలో వర్ణసూచిక గ్రామము.

**5. కావూరు :-** స్థలవాసుడు రామలింగేశ్వరుడైనను గ్రామ దేవత కావూరమ్మ. ఇట్టి గ్రామదేవత పేరున వెలసిన గ్రామములు 1. అలపర్రు - అలపర్తమ్మ, 2.ప్రజ్ఞ - ప్రగ్నెమ్మ, 3. శిరిపూడి - శిరిపూడమ్మ వగైరాలు ఈ తాలూకాలోనే ఎక్కువ ఉన్నవి. ఆదిన శాక్తేయపూజాంగమైన గ్రామదేవతారాధన ప్రాధాన్యతగా గల కాలమందు ఏర్పడిన గ్రామములు. కావు శబ్దము నేలస్వాభావికతను గూడా తెలియపరుచు అవకాశము గలదు. (కావు - దిగబడుట). ఇది భూ గుణసూచిక మరియు దేవతాసూచిక గ్రామ నామములలోనికి చెందినది.

**6. ఇంటూరు :-** గ్రామదేవత అంకమ్మ - కొండమ్మ. స్థలవాసుడు మూలస్థానేశ్వరుడు. మూలశబ్దము గ్రామనామోత్పత్తి నుండి చూడ శుక్లపక్ష తిథి - తదియకు అదిష్ఠానదేవత నిత్యక్లిన్నా - స్థానము స్వాధిష్ఠానము స్వరము 'ఇం'. ఇం-ఆదిగా చేర్చబడిన ఊరు ఇంటూరు గావచ్చును. దీనినిబట్టి గ్రామనామావళిలో మానవశరీర అంతరచక్ర - జ్యోతిష - చక్ర యంత్రములు గూడా అరుదుగా గ్రామనామావళికి మూలబీజమగుటకు అవకాశమున్నది. ఇది స్థానసూచిక గ్రామము. ఈశ్వర శబ్దమునకు ముందు స్థానశబ్దము గలిగిన ఆలయము తీరునుబట్టి గ్రామ నిర్మాణ మూల సూత్ర బిందు సాంకేతికముగా కన్పడుచున్నది. క్రీ.శ.1119 చేబ్రోలు శాసనమునుబట్టి నాటి పోరంటూరు నేటి ఇంటూరు గావచ్చును. పోరంటూరు =సాగుచేయని భూమియందు వెలసిన ఊరు. క్రమబద్ధతలేని ఊరు.

**7. యలవర్రు:-** రామలింగేశ్వర - వేణుగోపాలస్వాముల నిలయ మైనను, భూహద్దులమధ్యస్త గ్రామసూచికగా నున్నను సదాశివరాయల దానశాసనములో గోవాడ పడమటి హద్దును నిర్ణయించుచూ "యనమర్తి మహాగ్రామ ప్రాచీనా నాముపాశ్రితం" అనుటనుబట్టి యనమర్తికి తూర్పు హద్దున గోవాడ నున్నదనిరి. దీనినిబట్టి యనమర్తి మహాగ్రామమేకాక, ప్రాచీననామమును కలిగియున్నదని తెలియు చున్నది. యనపర్తి - యనుము - జంతునామము. యలపర్తి - పొలిమేరల మధ్యస్త గ్రామము. పర్తి - మర్తి - వర్తి - వర్రు స్థలనామసూచీ లేక జంతునామసూచీ గ్రామము. అల - యల - ప్రాచీనమున జలనిలయ స్థితిని తెలియజేయుట యని కొందరందురు.

**8. అమృతలూరు :-** ఇచట గ్రామదేవత పుట్టలమ్మ. పూర్వము ఈస్థలం అరణ్యముగా నున్నపుడు గొల్లవాడు పశువుల మందతో మేతనిమిత్తము వచ్చుట, - మందలోని ఒక ఆవు పుట్టపై పాలుగార్చుట - పుట్టలో గొల్లనికి లింగము కనిపించుట-తదుపరి ఆ లింగమూర్తిని ప్రతిష్ఠ చేయుట - అమృతసమానమైన క్షీరములు అనుభవించుట వల్లను అమృతేశ్వరుడనే పేరుపెట్టి-అడవిని గొట్టి ఆదేవుని పేర ఊరు కట్టినందున అమృతలూరు అని నామము వచ్చినది. ఇది సంఘటన నామావళి గ్రామము.

**9. పాంచాళవరం :-** ఇచ్చటి గ్రామదేవత పాళ్ళాలమ్మ. చందోలులోని శ్రీలింగోద్భవాలయమును కైలాసప్రస్థార విధానముగా నిర్మించు సమయమందు

(1019) - అచ్చటి శిల్పులలో ముఖ్యులైన ఐదుగురుకు రాజు వలన ఇవ్వబడిన భూమి ఖండము. ఈ భూఖండము - 5 గ్రామముల నుండి - అమృతలూరు, పెవరలి, గూడవల్లి, నడిమిపల్లి, గోవాడల నుండి 50 కుచ్చెళ్ళ భూమిని విడగొట్టి పంచాంణ్ణులకు ఇచ్చినందున పాంచాళవరం అని పేరున పిలువబడినది. ఈ భూమి ఇచ్చునాటికి ఈ స్థలము దుబ్బులగుంట. తుమ్మచెట్లు ఈ ప్రాంతమున అధికము. ఇది సంఘటన నామావళి గ్రామము.

**10. గోవాడ** :- గ్రామదేవత బండ్లమ్మ. అమృతలూరు కైఫియత్తునుబట్టి అమృతలూరు ఒకప్పుడు అడివి ప్రదేశము. ఆలపాడు కైఫియత్తునుబట్టి ఆవులమంద వుండే ప్రదేశమందు గ్రామము ఏర్పడ్డది కనుక ఆలపాడు నామము వచ్చినది - ఆలపాడుకు. అటులనే గోవుల - పశు నిలయములు వున్నచోట (వాడ - తావు) గ్రామము ఏర్పడుచున్నందున గోవాడ పేరు వచ్చినది. గో = ఎద్దు. గవః = ఆవు. గోవాడ = ఎద్దుల వాడ - ఎద్దులు వుండే తావు. గుంటూరు కైఫియత్తునందు గోవాడను గోసానికా పురమన్నది. ఇది దేవతాసూచి (జంతు) గ్రామము.

**11. దగ్గుపల్లి** :- గ్రామదేవత దేశమ్మ. పల్లి - బల్లి - మల్లి - మిల్లి.

దగ్గు - కాసము చేయు - కాసము - కాసః (శ్వాసకాస) - పంచలోహ

1. దుర్గ - దురగ - దుఃగన్ - దుగపల్లి - దుగ్గుపల్లి - దగ్గుపల్లి యని ఒకనానుడి.

2. దుగ్గుంటపల్లి - దగ్గుంటపల్లి - దగ్గుపల్లి - (పొలిమేర గ్రామము యలవర్రు నందలి చెఱువు నామములో దుగ్గుంట ఒకటి).

3. దృశ్ - (ప్రేక్షణే) - దృగ్ - దగ్ - కన్ను - ఇంద్రియ ప్రాధాన్యతన దగ్‌పల్లి = కనబడుపల్లి. దగ్గుపల్లి = దగ్గరపల్లి - అడవిదగ్గర పల్లి.

4. దగ్గుపల్లి - బుగ్గపల్లి - నుండి నామాంతరమొందిన దనిన ఆనాటి దగ్గుపల్లికి - నీరు "వాద" లో నిలువ ఉండుటయే గావచ్చును. వాద యన పల్లపు ప్రదేశము. తురుమెళ్ళ యన నీరు ఒడిగా సాగు స్థలము. ఇచట నుండియే పూర్వము వాగు వంటిది వాదప్రదేశమును నీటితో నింపును. యలవర్రు, తురుమెళ్ళ,

గోవాడల చేల మురుగునీరు ప్రస్తుతము వాదకాలువల ద్వారా బయటకు వెళ్ళుచున్నది. పూర్వము ఇచ్చట దగ్గుపల్లికి కావలసిన జల ఇచ్చట ఒకటి యుండి యుండవచ్చును. ప్రస్తుతము షుమారు వంద యకరములకు పైగా విస్తీర్ణముగల వాద వ్యవసాయభూమి కలదు. ఈ వాదభూమికి అంచున ఆగ్నేయమున దగ్గుపల్లి కలదు. బ్రిటీషువారు దుగ్గిరాల - నిజాంపట్నం - మూడు కాలువల త్రవ్వకము 150 సం॥ల క్రితము త్రవ్విన తదుపరి అనేక గ్రామములలో భూమి కాలువల (వాగుల ఎత్తుపల్లముల స్వరూపము - ప్రవాహ మార్గములు మారినవి. గోవాడలో తటాక, ధన, అగ్రహార, దేవాలయ, వన, ప్రభంద, సత్రాది, సప్తసంతానములలో తటాక నిర్మాణము లధికమగుట, సమృద్ధి జలముండుట, దగ్గుపల్లిని జల తరుగుట గ్రామ నిర్జనమునకు ఒక కారణమగుచ్నుది.

గోవాడ - దగ్గుపల్లిలు రెంటిని కలిపి ఏకగ్రామముగా సదాశివ దేవరాయలు అగ్రహారదానముగా చేయగా గ్రహీత శ్రీ చిలకమర్తి వల్లభాచార్యులు రెండు గ్రామములను కలిపి, శ్రీ భాష్యపురమని నామము పెట్టినను చరిత్రలో గతించిపోయిన నామముగనే రూపము దాల్చి - గోవాడ మిగిలింది. ఇది జలసూచీ లేక దేవతానామసూచి గ్రామము.

పైవానిలో "ఊరు" ప్రాచీనాంధ్రశాసనములలో క్రీ.శ.2వ శతాబ్ది నుండి నామము చివర కనిపించుచున్నదనిరి. క్రీ.శ. 5వ శతాబ్ది నుండి "పల్లె"నామము చివర వాడుచున్నట్లు పూర్వపరిశోధకులు నుడువు చుండిరి.

పైవానినిబట్టి దగ్గుపల్లి - గోవాడలకు తూర్పు-దక్షిణ ప్రాంత భాగములు పూర్వనామముల పేర్లు మారుట - పూర్వ మతాచార, సాంప్రదాయ, సంస్కృతులు మారుట గమనించగలము. మిగిలిన భాగము అడివిగా నుండుటను - తదుపరి జనావాస క్రమమును తెలియపరచుచున్నవి. భైరవేశ్వరమున ఈశాన్య సోమేశ్వరుడు తూర్పు విఘ్నేశ్వరుడు, పడమట నూకాలమ్మ, చూడ దగ్గుమిల్లి పాత శివుని పేరు సోమేశ్వరుడు మరియు ఇచట లభించిన వినాయక, ఆంజనేయ విగ్రహములు భైరవేశ్వర గ్రామ విగ్రహములతో కొంతసారూప్యత యున్నదన వచ్చును. పుట్టలమ్మ, పోళ్ళాలమ్మ నిర్జనారణ్య సాంకేతికాలు. దేశమ్మ స్థాన సాంకేతికము. ఇక్షు భూవర్ణ

సాంకేతికము. పూర్వము వాగునీరు, వరదనీరు, వర్షపునీరు వచ్చు ప్రదేశమునకు దిగువ లేక అంచున చెరువు, కుంట, గుంటలను త్రవ్వేడివారు. వానిద్వారా పశువులు, వ్యవసాయము చేసెడివారు. యనమర్తి - యనముల ఆవాసము.

# 47. గ్రామదేవతావిర్భావ విధానము

ఆదిన భూ, జల, నైసర్గిక వాతావరణములు (రంగు, రూపు, రుచి, స్థితి, గతి వగైరాలతోను) తదుపరి సంఘటనపరంగాను - కొంత దేశమును (ప్రదేశమును) వర్గీకరించి - ఆ దేశమునకు శక్తిని (మాతృస్వామ్యముగా) ఆవాహనతో ప్రాణప్రతిష్ట చేశెడివారు. ఇవి గ్రామ ఎల్లలు. ఆ శక్తియే - ప్రకృతిశక్తి. భూ స్థితినిబట్టి గ్రామ వర్గీకరణము చేసి దండక, సర్వతోభద్ర, నంద్యావర్త, భద్రక, స్వస్తిక, ప్రస్థర, కర్మక వగైరాలలో ఒకదానిని యెంచుకొని మధ్యన శీతలాంబ యంత్రసహిత శిలనుంచెదరు. ఇదియే బొడ్డురాయి - అంబరాయి. -వగైరా. ఇచట నుండి గ్రామ వర్గీకరణమునుబట్టి వీధులు - గొందులు - సందులు వగైరాలతో జనవసతి ఏర్పడును. ప్రకృతిశక్తి గ్రామదేవత కాగా చాతుర్వర్ణములకు - సకల జీవులకు రక్షణ. కాగా కులాంతర్గత వంశమునుబట్టి ఆవంశ సంఘటనల ఆధారతతో దేవరలు వెలసినవి. ఒక్కొక్క కులమునకు ఒక సాంఘిక జీవనసాంప్రదాయము (మరణ - పుట్టుక - వివాహాదులందు) అందుండి - వంశావళి ఆవిర్భావము (అంతర - సాంప్రదాయము)

1) దేశము - (గ్రామము) - ఎల్లల మధ్యస్తము - ప్రకృతిశక్తి
2) గ్రామము - అంబరాయి (శీతలాంబ) - దిక్‌నిర్ణయము - వాస్తు - ఆరోగ్యశక్తి.
3) కులము - వంశం - ఆరాధన - వంశాభివృద్ధి - కవచశక్తి.

1. (దేవీ భాగవతము - నవమస్కందము - ప్రథమోపాధ్యాయము శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్టు, హైదరాబాదు - నుండి).

కళాయాయాః సముద్భూతాః పూజితాస్తాశ్చభారతే
పూజితాగ్రామదేవ్యశ్చ గ్రామేచ నగరేమునే ।
ఏ వంకథితం సర్వం ప్రకృతేశ్చరితం శుభమ్
యధాగమం లక్షణంచ కిభూయః శ్రోతుమిచ్ఛసి.

ఇట్లు ప్రకృతి కళల నుండి పుట్టిన వారెల్లరును భారదేశమున జన్మించి యారాధింపబడిరి. ఓ మునీశా! గ్రామదేవతలు ప్రతిగ్రామము నందు పూజింపబడిరి. ఈవిధముగా మీకు ప్రకృతి శుభచరిత్రము వివరించితిని. ఇది ఆగమ ప్రోక్తము. సలక్షణము.

2. శ్రీ దేవీ మహత్యం (చండీనవశతి మంత్రమాలా ప్రథమ భాగము నుండి).

"మమశత్రూన్ శీఘ్రం మారయ మారయ జాగ్రత్స్వప్న సుషుప్త్య వస్థాస్వస్మాన్ రాజచోరాగ్ని జలవాత విషభూత శత్రుమృత్యు జరాది నానారోగే భ్యో నానాభిచారేభ్య; నానాపవాదేభ్యం పరకర్మ మంత్ర తంత్ర యంత్రౌషధ శల్యశూన్యక్షుద్రేభ్యః సమ్యఙ్మాం రక్షరక్షః

గ్రామదేవతల ప్రతిష్ఠలను శైవాగమములు - యామళ గ్రంథముల ననుసరించి, తాంత్రిక విధానమున ప్రతిష్ఠించెదరు. శీతలాంబదేవి శక్తి ప్రతిష్ఠలు మిత్ర - పరమమైత్రా - క్షేమ - సాధన తారాబలము ననుసరించెదరు. వీని పూజ అధికముగా పారశైవులు (కుమ్మర్లు) మరియు రజకులు చేసెదరు.

**1. అల్లూరు కైఫీయత్తు:-** "క్రీ॥శ॥ 1117 మొదలుకొని రాజ్యం చేస్తూ వుండి తుంగభద్రానదీతీర మంద్దుల వుండే దివ్యస్థళాలకు అగ్రహారములు మొదలయ్ని వృత్తులు ధారాగ్రహితం చేసి అనేక దేవతాప్రతిష్ఠలు చేసి ఆకాలమందు --- బహు అరణ్యముగా ఉండును గన్కు, ప్రస్తుత నామం గల అల్లూరు ఈ అరణ్యామధ్యమందు కొద్దిపల్లెగా వుండేదిగన్కు రాజు సముద్రస్నానం నిమిత్తం ఈపల్లెమీదుగా వచ్చి, తృణ, కాష్టజలసమృద్ధిగల స్థలమని అరణ్యం బేదించి, గ్రామం బస్తీచేశేయడల అల్లూరమ్మ అనేశక్తినొక పొదకింద భూగతమై వుండి, ఆ రాత్రి రాజుకలలో వచ్చి నీవు కట్టించే గ్రామం, నాపేరు పెట్టి, నాకు గుడి కట్టించ్చే నంన్ను ప్రతిష్ఠచేశి వుత్సవములు జరిగించుమని నేను గ్రామదేవరను అయి నీవు చేశిన ప్రతిష్ఠలు కాపాడుతూ వుంట్టాను అని తానువున్న స్థలం చెప్పెగన్ను రాజు అదేప్రకారం తానుకట్టించ్ని గ్రామానకు అల్లూరు అనే పేరుపెట్టి ఆస్థళమందు వున్న అల్లూరంమ్మ అనే శక్తిని గ్రామదేవతగా ప్రతిష్ఠచేసినాడు".

**2. చందవోలు కైఫీయత్తు:-** చందవోలు రాజు 1119లో కైలాసప్రస్థార విధానముగా ఆలయము కట్టించుటకుగాను "పది అయిదువేల బండ్లు వుంచి రాళ్ళు తెప్పిసస్తా వుండగా బండ్ల పట్నంధరికి వచ్చి అక్కడనుంచ్చి కదలకపాయగనుక యేవిధంవల్లను బండ్లు సాగించ్చే ఆలోచన తోచక రాజు చింతాక్రాంతుడై యుండగా ఆరాత్రి స్వప్నమందు శక్తిస్వరూపముగా వచ్చి నేను ఈ పట్నానికి చతుర్యుగములను కనిపెట్టి వుంన్న గ్రామశక్తిని. నీవు తెప్పించే బండ్లకు నేనే ఆటంకము చేశినాను. నీవు తెప్పించే బండ్లకు బండికి ఒక రాయి చొప్పున అక్కడవేయించి తనకు గుడి కట్టించి, ప్రతిష్ట చేసి వుత్సవములు జరిగించుమనింన్ని అక్కడ తవ్వించితే తన స్వరూపములో విగ్రహం వున్నదని చెప్పెగనుక తదనంత్తరం రాజు మహాసంతోషయుక్తుడై బండికి ఒకరాయి చొప్పున వేయించి, ఆలయం కట్టించి, ఆ స్థలమందు త్రవ్వించితే శిలావిగ్రహం అగపడ్డది. గన్క ఆ విగ్రహం గుళ్ళో ప్రతిష్టజేసి, సకలోత్సవములు జర్గించి బండ్లమ్మ అని ఆశక్తికి పేరు పెట్టినారు".

పైవానినిబట్టి 12వ శతాబ్దిలో అత్యధిక గ్రామదేవతల పునఃప్రతిష్టలు జరిగనవని భావించవచ్చును.

**3. భట్టిప్రోలు కైఫీయత్తు:-** "పూర్వం నుంచి 101 శివాలయాలు పూజానమస్కారాలు జరుగుతూవున్నప్పుడున్ను అమ్మవారు యీమెకాని మరివక స్థళం లేకుండా జరుగుతూ మహత్యం చాలా కలిగివున్నది. యిదివర్కు బ్రాహ్మణ పూజ జర్గుతూవుంన్నందున్ను దండిబొట్లు అనే పూజారి ఆలయములో వుత్సవం అయ్యి తర్వాత సువర్ణ్ణపు గిన్నె మరచి ఇంటికి వచ్చి, జ్ఞాపకం వచ్చి తిరిగి వెళ్ళేవరకు అమ్మవారు నూటవొక్క శక్తులతో కూడా కొలువుదీర్చి కూచుండ్డుట చూచి విభ్రాంతుడైనందున్ను అమ్మవారు ఆ గింన్నె యిచ్చి నీవు ఝడియక పొంమ్మన మనింన్ని యీవృత్తాంతం ఎవరితోను చెప్పవద్దనింన్ని చెప్పితివట్టాయనా నీశిరస్సుభిన్నం అవుననిన్ని వారికి శలవు యిచ్చిరి. గన్క అక్కడినుంచి ఇంటికి వచ్చి కొన్ని దినములకు ఆ ప్రసంగం భార్యతో చెప్పి నందున్ను శిరస్సుభిన్నం అయి మృతిపొందినాడు".

పైవానినిబట్టి ప్రకృతిశక్తులైన గ్రామదేవతలు నూట ఒకటిగా యుండెనని వీని ఆవిర్భావము - నామావళి క్రమబద్ధీకరించిన ఆప్రాంతం పరివర్తన విధానము బయటకు వచ్చునని దీనినిబట్టి తెలియుచున్నది.

## 48. గుంటూరు కైఫియత్తు - ప్రత్యేకత

గుంటూరు కైఫియత్తు జిల్లాలోని అనేకకైఫియత్తులు ప్రస్తావించని అనేక అంశములను ప్రస్థావించినవి. జైనమతస్తుడైన పెదనాగదేవభట్టు వ్రాసిన దండకవిలె ననుసరించి గుంటూరు కైఫియత్తు సాగినది. కరణీకపు వ్యవస్థ నియామకము నందు ఏగ్రామమునకు, ఏగోత్రులను నియమించినది వ్రాయుటలో నాగదేవభట్టు వాగులు, వంకలు పారిన విధమును వరుసక్రమమున చెప్పినటుల తోచును.

1) ఇంటూరు - దగ్గుబల్లి - గోవాడ - యలవర్రు (తురుమెళ్ళవద్ద చీలిన ఒకవాగు నుండి యలవర్రు - గోవాడ - దగ్గుబల్లి - ఇంటూరుల హద్దుల గుండా ఉపవాగు (వంక) ప్రవహించెను. ఇవియే కందవానికాలువ - గంగయ కాలువలు.
2) కొండముది - యోపర్రు - తురిమెళ్ళ
3) వేంపర్రు - బోడపాడు
4) గుండ్లపల్లి - నడింపల్లి - గూడవల్లి
5) ఆరేపల్లి - పొన్నపల్లి

## 49. గోవాడ సర్వేవిధానము

గోవాడ సర్వే కోడ్ నెం.68 కాగా ఆరు ఫర్లాంగుల దూరములోని పాంచాళవరం (67); ఒకమైలు దూరములోని నడిమిపల్లి (50); ఒకమైలు దూరములోని పొన్నపల్లి (51); ఒకమైలు దూరములోని ఆరుంబాక (52); ఒకమైలు దూరములోని కావూరు (53); ఒకమైలు దూరములోని ఇంటూరు (83); నాలుగు ఫర్లాంగుల దూరములోని యలవర్రరు (69); ఆరు ఫర్లాంగుల దూరములోని అమృతలూరు (66) న్ను అయి వున్నవి.

జి.వో.నెం. 1240 రెవిన్యూ ది.29.04.1912 అసిస్టెంట్ డైరెక్టర్ - మద్రాస్ సర్వేవారి ప్రకారము గోవాడ విస్తీర్ణము 4076.10 యకరములు అయి వున్నది. ఈ విస్తీర్ణమును 1 నుండి 1224 సర్వే నెంబర్లుగా విడగొట్టిరి.

గోవాడ గ్రామ గుడికట్టు (గ్రామకంఠం) 355, 356లతో గూడిన 354 అయి వున్నది. గోవాడ గ్రామ చెరువుల: 1) శేషన్న చెరువు సర్వే నెంబరు (45); 2)మంగమ్మ చెరువు (1149); 3) పీరామ చెరువు (1100); 4)బాపయ్య చెరువు (1089); 5) (1079) - బి చెరువు పూడ్చబడినది; 6)దాసరి చెరువు (853); 7)కోటేశ్వరస్వామి చెరువు (613); 8)అంకుమయ్య చెరువు (395); 9) కాకి చెరువు (385); 10)ఊర చెరువు (353); 11)రామేశ చెరువు (239); 12)ఊర చెరువు(బాలయ్య చెరువు) (286); 13)బండ్లమ్మ చెరువు (897); 14)మాల చెరువు (938) లు అయి వున్నవి. ఇందు బాపయ్య చెరువు, పీరామ చెరువు, శేషన్న చెరువులు గ్రామ పొలిమేరల హద్దుగా యున్నవి.

శ్రీ వేణుగోపాలస్వామి ఆలయము సర్వే నెంబరు 354లోను, శ్రీకోదండరామస్వామి ఆలయము 898లోను, శ్రీ బాలకోటేశ్వరస్వామి ఆలయము 813లోను వుండెను.

బస్సుత్రోవలు :- పొన్నూరు - ఇంటూరు - చెరుకుపల్లి - భట్టిప్రోలు బస్సుమార్గము - గోవాడ సర్వే నెంబరు 710, 788, 786 గుండా పోవును. మరియు తెనాలి - అమృతలూరు - చెరుకుపల్లి బస్సు మార్గము గోవాడ 440, 401, 400, 394, 385, 941-ఎ, 865-బి, 941-బి, 628, 801 గుండా పోవును.

గోవాడ డొంకలు:

1) గోవాడ - కావూరు 605బి, 606, 758ఎ, 758బి ల గుండా బోవును.

2) గోవాడ - యలవర్రు 921, 531బి, 531ఎ ల ద్వారా బోవును.

3) గోవాడ - పంచాళవరం 323, 235, 222, 216, 215, 199, 198 ల ద్వారా బోవును.

4) గోవాడ - నడింపల్లి 992, 1146, 1147, 1182, 1190 ల ద్వారా బోవును.

కాలువలు : 1) గుళ్ళపల్లి కాలువ: తురుమెళ్ళవద్ద నిజాంపట్నం తూర్పుకాలువ నుండి మొదలై యలవర్రు హద్దు వద్ద 1200 నుండి 1203, 1199 నుండి 1196, 1204, 1218, 1221 నుండి 1219, 1222 నుండి 1224 ల గుండా గోవాడను దాటి గుళ్ళపల్లి వెళ్ళును. గుళ్ళపల్లి కాలువనుండియే ఆరుంబాక కాలువ అను ఉపకాలువ గోవాడ నుండి వెళ్ళును. గోవాడ గ్రామ పూర్తి మురుగు గుళ్ళపల్లి కాలువ - వాలుకు - కుడిన గల వాద, గంగయ కాలువల ద్వారా యలవర్రు, గోవాడ, ఇంటూరుల మురుగునీరు కావూరు హద్దునకు ప్రవేశించును. మరియు వాలుకు ఎడమన గల గంగోలుకు పాంచాళవరం, గోవాడ, నడింపల్లిల మురుగు వెళ్ళును. ఇవి అనాది వాగులనవచ్చును. గంగోలు ఎదురు దన్నిన మురుగు గోవాడ ఊరుదాకును.

వాదకాలువ : గోవాడ సర్వే నెం.601 వద్ద నుండి 599, 646, 654 ల గుండా గంగయ కాలువ చేరి, తిరిగి 1205 నుండి 1211 ల ద్వారా కావూరు హద్దు చేరును.

3. దగ్గుమిల్లి : గ్రామకంఠము 614, 689 లలో యుండ కోనేరు (పంపుల చేను) 690లోను, దేశమ్మ 700లోను ఉండెను. దగ్గవల్లికి ఈశాన్యమున బాలకోటేశ్వరస్వామి చెరువు 613లో వుండెను.

## 50. దుగ్గన - కాంచీమహత్యము

క్షోణీనభంబులు మాత్రించిన ట్లింద్రచాపంబు చాపమై సంఘటింప
బ్రహ్మాండభాండంబు పగిలించు గర్జలు సింహనాదస్ఫూర్తి జేయుచుండ సౌదామినీ
దామజాలము ల్దిక్కుల స్వప్రతాపానలజ్వాలలుగను నాహార్య హరిణోద్యదశని
సంఘంబులు దివ్యాస్త్రవితతులు తేజరిల్ల
నాశుశరవృష్టి శరవృష్టి నఖిలలోక - బాధ కోర్ద్రీష్మభీష్మశుంభత్ప్రతాప
మార్చెనర్జునయుతశిఖండ్యభివర్థ (?) - నాఖ్యవర్షర్తునారాయణాఖ్యమూర్తి.

బంధూక మడరించెబరపయ్యె గేదంగి కడిమి పుస్పితమయ్యె గ్రంథివూచె
నర్జునం బలరారె నరవిందములు కేరె భూస్థలి నేరులు పుక్కిలించె చెలగె
గండూపదము లుబ్బెగలరె హంసచయంబు నటియుంచె గప్పలు నమిలి
జాతకంబులు మించె సాగరం బెడయించె హరిగోపవ ఖలతోడ నాడెలేళ్ల
మత్తభృంగంబులకు దేనె రిత్తయయ్యె - గండుకోయిలకూతలు గట్టుకొనియె
చూలుకొన స్వాతి చూటి బొదువ (?) - విష్ణునకు నిద్రపోయెడి వేళయయ్యె.

# 51. ఈ సంకలనమునకు ఉపయోగించిన గ్రంథములు


01. ఆంధ్రదేశంలో జైన బౌద్ధ మతాలు ... (శ్రీ బి.యస్.యల్. హనుమంతరావు)
02. ఆంధ్రుల చరిత్రము - మధ్యయుగము ... (చిలుకూరి వీరభద్రరావు)
03. మోపర్రు శాశనాలు ... (శ్రీయన్. రమేసన్, యం.ఏ., ఐ.ఏ.యస్.)
04. కమ్మవారి చరిత్ర ... (కొత్త భావయ్య చౌదరి)
05. గుంటూరు జిల్లా కైఫీయత్తులు.
06. గుంటూరు మండల దేవాదాయ ధర్మాదాయ దర్శనము.
07. గోవాడ గ్రామ పావులూరి వారి వంశవృక్షము.
08. గుంటూరు జిల్లా శాశనములు.
09. ఆయుర్వేద శిక్ష - భారతీయవిజ్ఞానము.
10. శ్రీ పి.యు.సి. జిల్లా పరిషత్ పాఠశాల రజతోత్సవ సంచిక. (గోవాడ)
11. ఆది శైవము - శివాచార్యపరంపర ... (యస్. వెంకట్రామయ్య)
12. మానసారము.
13. సమగ్ర ఆంధ్ర సాహిత్యము - 1, 2, 4, 5 భాగములు ... (ఆరుద్ర)
14. దక్షిణ భారత చరిత్ర. ... (నండూరి రామక్రిష్ణమాచార్య)
15. భారతీయ వ్యవసాయ చరిత్ర. ... (పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రి )
16. దగ్గుమిల్లి నుండి గోవాడ దాకా ... (శ్రీ తుమ్మల వెంకటరత్నం)
17. ప్రాచీనాంధ్రచారిత్రక భూగోళం ... (శ్రీ కుందూరి ఈశ్వరదత్తు)
18. పి.యు.సి. జిల్లా పరిషత్ పాఠశాల స్వర్ణోత్సవ సంచిక, గోవాడ.
19. గ్రామ నామములు - పరిశోధన
20. దేవీ భాగవతము - శ్రీ వేంకటేశ్వర అర్ష భారతి ట్రస్ట్, హైదరాబాద్.
21. శ్రీదేవీ మహత్యం - చండీ నవశతి
22. సర్వే మ్యాప్ - గోవాడ - 1912


